# ఉదయభాను

## బాలసాహిత్యం 1

(కథల సంపుటి)



డా. ధారా రామనాథశాస్త్రి




ఉదయభాను పబ్లికేషన్స్
ఇ. కె. నివాస్, మామిడిపాలెం
ఒంగోలు

# పరిచయం



భారతంలో కౌరవపాండవుల కథతోపాటు సందర్భాన్ని బట్టి వ్యాసమహర్షి కొన్ని చిన్నకథలను చెప్పారు. వానిలో ఎల్లకాలమూ పనికివచ్చే సన్నివేశాలూ, పాత్రలూ, నీతులూ జీవిత సత్యాలూ ఉన్నవి. శాశ్వతమైన విలువలుగల ఇలాంటి కథలు చదవడం వల్ల పాఠకులకు ముఖ్యంగా పిల్లలకు మంచి భావాలు, సంస్కారము, సభ్యత అలవడుతాయి. అలాంటి కొన్నికథలను ఎన్నుకొని సులభశైలిలో తెలుగు బాలబాలికలకు అందించడమే ఈ రచన ఉద్దేశం.

బాలబాలికలు ఈ కథలను చదివీ, తమతో తాము చెప్పుకొనీ సంస్కారవంతులవుతారని ఆశిస్తున్నాను.

ముఖచిత్రకారులు సూర్య ఆర్ట్సువారికీ, ముద్రాపకులు శ్రీ రత్నం ప్రెస్ వారికీ, ప్రచురణ కర్తలు ఉదయభాను పబ్లికేషన్స్ వారికీ నా కృతజ్ఞతలు.

విజయదశమి<br>23-10-83<br>ఒంగోలు

ధారా రామనాథశాస్త్రి.

# జోస్యం చెప్పే కాకికథ

కోసలదేశాన్ని క్షేమదర్శి అనేరాజు పరిపాలిస్తున్నాడు. అతని స్వభావం చాలా మెత్తనిది. ప్రజల మంచిచెడ్డలు గమనిస్తూ వాళ్ళకి మేలు చేయాలనే ఆలోచన ఆతని మనస్సులో ప్రధానంగా ఉండేది కాని రాజన్నవాడికి మంచి ఆలోచనలు ఉండటమే ముఖ్యంకాదు. వాటిని అమలు చేయడానికి తగిన శక్తిసామర్థ్యాలూ మంచి పటిష్టమైన రాజ్యాంగ విధానమూ అవసరం. ఇవి సరిగా లేకపోయేసరికి మంత్రులూ సేనాపతులూ ఇతర అధికారులూ తోక జాడిస్తారు. క్షేమదర్శి విషయంలో సరిగా ఇలాగే జరిగింది. ఉద్యోగులు అవినీతిపరులై రాజ్యానికి ద్రోహం చేస్తున్నారు. పన్నులు కట్టవలసిన మేరకు ప్రజలు పన్నులు కట్టడంలేదు. ప్రజలదగ్గర చూసీ చూడనట్టు డబ్బు దండుకోవడం, ఆ డబ్బును ఖజానాకు కట్టకపోవడం వంటి అవినీతి కార్యాలలో ఉద్యోగులు బాగా ఆరితేరారు. ఎప్పుడైనా క్షేమదర్శి మహారాజు ఆయా విషయాలు హెచ్చరించినపుడు ఉద్యోగులు ఏదో ఓసాకు చెప్పేవారు. పంటలు పండలేదనో, కరువు వచ్చిందనో, వరదలు వచ్చాయనో ఇలా......... రాజు తనపేరుకి తగ్గట్టు ప్రజల క్షేమాన్ని దర్శించి (చూచి) బాగా పరిపాలన చేస్తున్నాను

కదా! అని తృప్తి పడుతుండేవాడు. దేశంలో సంపద తరిగి పోయింది. ప్రజలు ఎవరి ఇష్టం వచ్చినట్లు వాళ్ళు ప్రవర్తిస్తున్నారు. ఒకరాజు ఉన్నాడు, అతని చేతిలో పరిపాలనఉన్నది, అతడు దేశాన్ని చక్కగా పరిపాలిస్తున్నాడు అనదగిన వ్యవస్థ లేదు. అంతా కుక్కలు చించిన విస్తరిలాగ అయిపోతున్నది. కాలం గడుస్తున్నది.

ఆనాడు మంత్రి సామంత సేనాపతులతో ఒక సమావేశం ఏర్పాటు చేశాడు క్షేమదర్శి. తనముందు కూర్చున్న ప్రధాన మంత్రితో "మంత్రీ! మనరాజ్యం ఎలా నడుస్తున్నదంటావు?" అని అడిగాడు రాజు. ప్రధానమంత్రి చేతులు జోడించి "మహారాజా! ఆ విషయాలు నేను చూచుకుంటాను. ఒక్కమాటలో ప్రజలందరూ భూతలస్వర్గం అనుభవిస్తున్నారు. మీ మంచిదనాన్ని, దయార్ద్ర హృదయాన్నీ వేనోళ్ళ కొనియాడుతున్నారు. నేను ఇన్నేళ్ళుగా మీ మంత్రినై తమ ఆజ్ఞ మేరకు రాజ్యాన్ని నడుపుతున్నందుకు నాకే చాలా ఆనందంగా ఉన్నది. ఈ విషయంలో తమరు దిగులు పడవలసింది గాని, శ్రమతీసుకొని ఆలోచించవలసిందిగాని ఏమీ లేదని నా మనవి. అటుపైన ఏలినవారి చిత్తము." అంటూ నక్కవినయం ప్రదర్శించాడు. క్షేమదర్శి సంతోషపడి సేనాపతి వైపు చూచాడు. అతడుకూడా వినయంతో లేచినిలబడి నమస్కరించి ఇలా చెప్పాడు. "అయ్యా! మీ చల్లని పరిపాలనలో ప్రజలు ఎంతగా సుఖపడుతున్నారో పొరుగు

రాజ్యాల రాజులు అంతగా భయపడుతున్నారు. మనసైన్యం శత్రువులని గడగడ లాడిస్తున్నది. శత్రురాజులు మన రాజ్యం వైపు కన్నెత్తి చూడలేకుండా ఉన్నారు. సరిహద్దులు కట్టు దిట్టం చేశాను. సైన్యాలకు శిక్షణ ఇప్పిస్తున్నాను. మనం దండెత్తినా, మనమీదికి ఎవడైనా దండెత్తినా శత్రువులు భస్మం కావలసిందే కాని బ్రతికి బట్టకట్టలేరు. మీ దయువల్ల నా కృషివల్ల అంతా సవ్యంగా ఉంది" అన్నాడు. రాజు మరింత సంతోషించి కోశాధికారివైపు చూచాడు. అతడు మంత్రి సేనాపతులంత హడావిడి లేకుండా క్లుప్తంగా మూడు ముక్కల్లో "అంతాబాగా ఉన్నది" అని నమస్కరించాడు. రాజు సభ చాలించి తృప్తిగా లేచివెళ్ళాడు.

ఆనాడు రాత్రి మంత్రి సేనాపతులూ కోశాధికారీ ఒక రహస్య స్థలంలో సమావేశమయ్యారు. ముందు మంత్రి అన్నాడు. "ఇన్నాళ్ళూ లేనిది ఇవ్వాళ రాజుకి దేశపరిపాల నలో వల్లమాలిన శ్రిద్ధ పుట్టుకొచ్చింది. దీనికి కారణం ఏమై యుంటుంది?" సేనాపతి అన్నాడు "వాడిముఖానికి అంత మాత్రం తెలివి తేటలు కూడానా! ఏదో ఉబుసుపోక కాస్సేపు కాలక్షేపం చేశాడు అంతే"- కోశాధికారి మాత్రిం కొంత ఆలోచన చేస్తున్నట్టు అన్నాడు. "అలా కొట్టిపారెయ్యడానికి వీలులేదు. మనమీద ఏదో అనుమానం వచ్చి ఉంటుంది. ఎందుకైనా మంచిది. మనం కొంచెం జాగ్రిత్తగా ఉండాలి.

మీ కేం బాధలేదు. ప్రజలదగ్గర డబ్బు సంపాదించి మిమ్మ ల్నందర్నీ పోషిస్తున్నది నేను. ఏదైనా అష్టంతిరిగితే నామెడకి చుట్టుకుంటుంది." అన్నాడు. సేనాపతి మీసం దువ్వుతూ "ఎవరి మెడకూ ఏమీ చుట్టుకోదు. అతడు ఏమైనా కదిలా డా డా దాత్రికి రాత్రి.." అంటూ మొలలో ఉన్న కత్తిమీద చేయివేసి 'సఫా'— అన్నాడు. అందరూ సంతోషంతో వికటంగా నవ్వుకున్నారు.



మరునాడు ఉదయం కోసల పట్టణం వీధుల్లో ఒక నూతనవ్యక్తి నడుస్తున్నాడు— అతడు బాగా పొడగరి. పెరిగినగడ్డం, చాలా కాలం తపస్సుచేసి చిక్కిపోయిన శరీరం, ముఖంమీద కొట్ట వచ్చినట్టు కాంతి, కళ్ళల్లో పట్టుదల, పెద్దపెద్ద అంగలు వేసు కుంటూ వీధుల్లో నడుస్తున్నాడు. చేతులో ఒక పంజరం ఉంది. కాని ఆ పంజరంలో చిలుక ఉండవలసినచోట అస హ్యం కలిగించే ఒక కాకిఉంది. అతడు ఆ పంజరాన్ని చాలా పదిలంగా మోసుకొని నడచి వెళ్ళడంచూచి కొందరు నవ్వు కున్నారు. కొందరు గేలిచేశారు. మరికొందరు పిచ్చివాడు కాబోలు అనుకున్నారు. అతడు ఎవర్నీ లెక్కచేయకుండా ఏకాయెకిని రాజభవనంవైపు నడచి వెళ్ళుతున్నాడు. ఇంతలో కొంతమంది ప్రజలు గుంపులు గుంపులుగా ఆయనచుట్టూ చేరారు. అందులో ఒకడు ఆ నూతనవ్యక్తికి దణ్ణంపెట్టి

"అయ్యా! మిమ్మల్నిచూస్తే బాగా తపస్సు చేసిన మునీంద్రు ల్లాగా ఉన్నారు. ఆ పంజరంలో కాకి ఏమిటి? మీ ప్రయాణం ఎక్కడికి?"– అన్నాడు. ఆయన బిగ్గరగా నవ్వి "మీరందరూ ఆశ్చర్యపోతున్నారు కదూ. నాకు తెలుసు. కాని ఇది మామూలు కాకికాదు. దేవతల కాకి. చాలా తెలివిగలది. జరిగిందీ, జరుగుతున్నదీ, జరుగనున్నదీ ఇట్టే పసిగట్టి చెబుతుంది. అంటే త్రికాలవేది. మీరెవరైనా కావాలంటే ప్రశ్న అడిగిచూడండి" అని చాలాధైర్యంగా సవాలు చేస్తున్నట్టు చెప్పాడు. ఆ పౌరుడు "నేను ఒకప్రశ్న అడగవచ్చా" అన్నాడు.

'ఓ తప్పకుండా' కాని ఒకషరతు. డబ్బువిషయం ప్రశ్నించేవాడు బంగారు నాణెం దాని కాలిదగ్గర పెట్టి తూర్పుకి తిరిగి దణ్ణంపెట్టి ప్రశ్న అడగాలి. శత్రువులను జయించదలచుకున్నవాడు వజ్రాన్ని ఉంచి నమస్కరించాలి. అధికారం, రాజ్యపదవీ మొదలైన సంగతులను ప్రశ్నించ దలచుకున్న వారు నవరత్నాలు ఉంచి నమస్కరించాలి. సమ్మతమేనా!" అంటుండగా ప్రజలందరూ ఒకరి మొగం ఒకరు చూచుకుని సంకోచ పడుతుండగా ఇంతలో హుజారంలో గంటమ్రోగింది. అంటే రాజుగారు కొలువుకు వచ్చారన్న మాట. ఆ నూతన వ్యక్తి హడావిడిగా 'రాజుగారి దర్శనం చేసుకోవాలి' అంటూ నడచి వెళ్ళాడు. కోసల రాజ్యంలో ఉన్న ఆచారం ప్రకారం రాజుగారు కొలువుతీరి ఉన్నప్పుడు కొత్తవాళ్ళకి ముఖ్యంగా

మునీశ్వరులకు అభ్యంతరం లేకుండా ప్రవేశం లభిస్తుంది. నూతనవ్యక్తి సభలోనికి ప్రవేశించి రాజుని ఆశీర్వదించి ఇలా చెప్పాడు.

"రాజా! నీకు శుభం జరగాలి. నాపేరు కాలకవృక్షీయ మహర్షి. నేను హిమాలయాల్లో చాలా సంవత్సరాలు కఠిన తపస్సుచేసి కొన్ని శక్తులు సాధించాను. ఆ శక్తుల ఫలితంగా ఈ కాకిని సృష్టించాను. దీనికి చాలా మహిమలున్నవి...! రాజు "కాకికి మహిమలా? ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు. ముని "అవును ప్రభూ ఆశ్చర్యమే" అంటూ పురవీధిలో ప్రజలకు చెప్పిన వృత్తాంతం రాజుకిగూడా చెప్పి "ఈ కాకిని మీకు బహూకరించడానికి వచ్చాను. ఇది మీ రాజ్యాన్ని రక్షిస్తుంది" అనిచెప్పి ఆ పంజరాన్ని సింహాసనం దగ్గర ఉంచి గిరుక్కున తిరిగి వెళ్ళిపోయాడు. క్షేమదర్శి తనలో తాను సవ్వకుని మంత్రిని పిలిచి "మంత్రిగారూ! చూచారా. ఎవరి పిచ్చి వారికానందం. కాకేమిటి త్రికాలవేది కావడమేమిటి? అయినా సరే. ఒక మునీంద్రుడు ఇచ్చినప్పుడు కాదనడం బాగుండదు కదా. ఈ కాకిని పంజరంతో సహా మీరు భద్ర పరచండి" అని ఇచ్చాడు.



ఆ రాత్రి మంత్రి, సేనాపతి, కోశాధికారి రహస్యంగా సమా వేశమై పంజరం దగ్గరకు చేరారు. మొదట మంత్రి, తరువాత

సేనాని, ఆ తరువాత కోశాధికారి మునిచెప్పినట్లు నవరత్నాలు వజ్రాలు, బంగారు నాణాలు పంజరంలోఉంచి తమమనస్సుల్లో ఉన్న అనుమానాలను ప్రశ్నలుగా అడిగారు. మంత్రి అడిగాడు క్షేమదర్శిని చంపేసి తాను ఎప్పటికైనా రాజు కాగలనా! అని. సేనాపతి అడిగాడు తను మంత్రిపదవి పొందగలడా! అని. కోశాధికారి అడిగాడు తన సంపద ఇంకా ఇంకా పెంపొందుతుందా! అని. కాకి అన్నిటికీ కావుకావు మన్నదే తప్ప ఏమీ చెప్పలేదు. చాలాసార్లు ప్రశ్నించి విసిగిపోయిన సేనాపతి తన కత్తితో కాకిని ముక్కలు ముక్కలుగా చేసి చంపేశాడు.



మరునాడు ఉదయం క్షేమదర్శి శివాలయంలో అభిషేకం చేయడానికి వచ్చినప్పుడు కాలకవృక్షీయ మహర్షి వచ్చాడు. రాజు ఆయన్నిచూచి ఆశ్చర్యంగా "ఏం మళ్ళీ వచ్చావు"- అన్నాడు. "మహారాజా! క్షమించండి. రెండో కంటివాడికి తెలీకుండా మీకు కొన్ని విషయాలు చెప్పాలి. శ్రద్ధగా వినండి. మొదటి విషయం మీరు నన్ను పోల్చుకో లేదు. నేను ఎవరినో కాదు. మీ నాన్నగారైన క్రాంతదర్శి మహారాజు స్నేహితుణ్ణి. ఆచల్లని ప్రభువు దివంగతుడయ్యాక నాకు వైరాగ్యంకలిగి అరణ్యాలకి వెళ్ళి తపస్సు చేసుకుంటూ

ఉండిపోయాను. ఎందుకో మనస్సుండబట్టలేక మిమ్మల్ని, మీ రాజ్యాన్నీ చూచిపోవాలని వచ్చాను. చాలా రోజులు మీ రాజ్యంలో అజ్ఞాతంగా తిరిగాను. పరిస్థితులన్నీ అర్థం చేసుకున్నాను. మీరిప్పుడు చాలా ఆపదలో ఉన్నారు. ఎలా గంటారా? దయచేసి వినండి. మీరు మంత్రి సేనాపతి కోశాధికారులను నమ్మి వాళ్ళకి పెత్తనం అప్పజెప్పారు. వాళ్ళు ద్రోహులు. స్వార్థంతో మిమ్మల్ని మోసంచేసి ప్రజలను పీల్చి పిప్పిచేసి రాజ్యాన్ని యీ స్థితికి తెచ్చారు. రాజు డబ్బు సంపాదించడం మొదలు అన్నిపనులూ స్వయంగా చూచుకోవాలి. అధికారులను నమ్మినట్టు నటించాలి కాని నమ్మకూడదు. ఇప్పుడేమైందో మీరు గమనించారా? నిన్నరాత్రి మీ ముగ్గురు అధికారులూ స్వార్థంతో కళ్ళు మూసుకొనిపోయి కాకిని చంపారు. ఈ విషయం మీరు తెలీనట్టు నటించండి. రేపు వాళ్ళని సభకి పిలిచి ఆకాకి విషయం ఆనూక్కీ తీయండి. అందరూ అబద్ధాలు చెప్పి ప్రమాణం చేస్తారు పంజరం తెప్పించి చూడండి. నేనూ అక్కడే ఉంటాను.. అన్ని విషయాలూ మీకే తెలుస్తవి..." అంటుండగా...

రాజు కృతజ్ఞతతో నమస్కరించి "మహర్షీ! మీఋణం జన్మజన్మలకీ తీర్చుకోలేను. మీరు మా నాన్నగారికి స్నేహితులే కాని నా పాలిట దేవుళ్ళు. రేపు ఉదయం సభకిరండి. వాళ్ళముగ్గుర్నీ ఓపట్టు పడతాను. మీరు నామీద దయతో

నా ప్రజలను కాపాడి నా రాజ్యాన్ని పూర్వంలాగ ఔన్నత్యం పొందేలాగ చేసి మంత్రిపదవి చేబట్టాలి. మహర్షి "అలాగే ముందు ముళ్ళని తీసేయండి-తరువాత గులాబీలు కోసుకుందాం." అంటూ వెళ్ళిపోయాడు. క్షేమదర్శి తృప్తిగా శివునికి అభిషేకం చేసుకుని వెళ్ళిపోయాడు.



ఆనాడు రాజసభా మధ్యాన రక్తంతో తడిసిన పంజరము, అందులో కాకి శరీరపు ముక్కలూ ఒక వేదికమీద ఉన్నవి. అధికార పురుషులు ముగ్గురూ అక్కడే నిలబడి రాజు ఊహించినట్టుగా ఆ కాకి చావడానికీ తమకూ ఏమీ సంబంధంలేదని ప్రమాణాలుచేసి మరీ చెప్పారు. రాజు వాళ్ళ మాటల్ని నమ్మినట్టే నటించి మంత్రిని దగ్గరకు పిలిచి "నిజమే మంత్రిగారూ! బహుశా ఏదో పొరపాటు జరిగి ఉంటుంది. పోనివ్వండి. ఈ కాకి కారణంగా మనలో మనకి అపార్థాలు రాకూడదు. ఒక పని చెయ్యండి. ఎంతైనా దేవతాకాకి కదా! ఇవ్వాళ్ళరాత్రికి దీనిని స్మశానానికి తీసుకువెళ్ళి మీరే స్వయంగా దహనం చేయించండి. దానితో మనపీడ వదులుతుంది. ఒకవేళ దీని దహన సంస్కారాలు సరిగా జరక్కపోతే దయ్యమయి పట్టినా పట్టవచ్చు." అంటూ పకపకనవ్వాడు. మంత్రికూడా నవ్వులో నవ్వుకలిపి "ఏలినవారి ఆజ్ఞ" అన్నాడు.

ఆనాటి రాత్రి స్మశానంలో ఒకగోయి త్రవ్వించి పంజరంతోసహా కాకిని పూడ్చిపెడుతున్న సమయంలో కాకికాళ్ళ దగ్గర ఒక తెల్లకాగితం గాలికి అటూఇటూ కొట్టుకుంటూ కనిపించింది. ఆశ్చర్యపడిన మంత్రి కాగితంతీసి ఆత్రుతగా చదివాడు. అందులో ఇలా వ్రాసిఉంది. "ఇవ్వాళ్ళరాత్రి సేనాపతి, కోశాధికారి కలిసి నీమీద కుట్రపన్ని నిన్ను హత్య చేస్తారు హెచ్చరికగాఉండు." ఆ మాటలు చదివి మంత్రిఒళ్ళు తెలీని కోపంతో అప్పటికప్పుడు గుఱ్ఱంమీద బయలుదేరి వెళ్ళి నిద్రలో ఒళ్ళు మరచిఉన్న సేనాపతిని, కోశాధికారిని చంపేశాడు. ఇలా చంపి గుఱ్ఱం ఎక్కబోతుండగా ఇద్దరు సైనికులు మంత్రిదగ్గరకు వచ్చి "మహామాత్యులు మన్నించాలి. సేనాపతిని, కోశాధికారిని హత్యచేసిన నేరానికి రాజాజ్ఞ మేరకు మిమ్మల్ని బంధిస్తున్నాం." అంటూ చేతులకు సంకెళ్ళువేసి తీసికొని వెళ్ళారు.



మరునాడు నిండుసభలో క్షేమదర్శి మహారాజు జరిగిన విషయాలన్నీ పౌరులకుచెప్పి, మంత్రికి ఉరిశిక్షవేసి కాలక వృక్షీయ మహర్షిని మహామంత్రిగా నియమించాడు. ఆయన కృషివల్ల దేశం సుభిక్షమై ప్రజలు సుఖపడ్డారు.

(ఈ కథవల్ల వ్యాసమహర్షి మనకి కొన్ని ముఖ్యమైన నీతులు బోధించాడు. రాజులు ధనార్జనలోను, ప్రజలకి కావలసిన

సౌకర్యాలు ఏర్పాటు చేయడంలోను ఎప్పుడూ అశ్రద్ధ చేయక, చాలా జాగ్రత్తగా మెలగాలి. అధికారులు తమ విధులు చక్కగా నిర్వర్తిస్తున్నారా, లేదా! అని ఒక కంట కనిపెడు తుండాలి కొంతమంది మహర్షిలాంటి వాళ్లు ప్రజల మేలు కోరడంవల్ల, స్నేహధర్మంవల్ల మంచి పనులు చేస్తుంటారు. వాళ్ళని ప్రజలు ఎప్పుడూ గౌరవిస్తారు. ప్రజల నోళ్ళుకొట్టి స్వార్థంతో ప్రవర్తించే అధికార పురుషులకి ఏనాటికైనా పతనం తప్పదు)

*—*



# కుక్క బుద్ధి

ఒక పెద్ద అరణ్యంలో మధ్యభాగాన చాలాకాలం నుండీ ప్రేమస్వరూప్ అనే ఒక మహర్షి తపస్సు చేసుకుంటుండేవాడు. పేరుకు తగ్గట్టే అతనికి మనుషుల మీదనే కాక పశుపక్ష్యాదుల మీదకూడా చాలాప్రేమ ఉండేది. సృష్టిలోని జీవరాసులన్నీ దేవుని ప్రతిబింబాలనీ, ఒకరివల్ల మరొకరికి కీడు జరగరాదనీ ఆయన కోరుతుండేవాడు. మరి అడవిలో ఇదెలా సాధ్యం? ఆయన ఒక ఉపాయం కనిపెట్టాడు.

ప్రతిదినమూ ఉదయం నదికి స్నానానికి వెళ్ళేప్పుడూ తిరిగి వచ్చేప్పుడూ జంతువులన్నిటినీ ప్రేమగా పలుకరించే వాడు. సింహాలు ఎదురుపడితే 'ఏమయ్యా! మృగరాజులూ! ఏమంటున్నారు? హాయిగా దుర్గాదేవికి వాహనాలుగా ఉండ వలసిన మీరు అడవుల్ని ఏలుకుంటున్నారు. తక్కిన జంతువులు మీకంటె తక్కువకదా! మరి వాటిని నిర్దయగా చంపేయకండి. ఆహారానికి అవసరమైతే తప్ప ఏ జంతువునీ చంపకండి. నేను చూడండి. కందమూలాలతో, ఆకులలములతో కాలక్షేపం చేయడంలేదూ......' ఆ సింహాలన్నీ యీయన మాటలు అర్థం చేసుకున్నట్లుగా జూలు విదిలించి మెడవంచి సన్నగా ధ్వనిచేసేవి. ఇంకా కొంచెం నడచి పోయాక చిరుతపులులు కనిపిస్తే వాటిని దగ్గరకు చేర్చుకొని

"ఆహారానికి మాంసం సంపాదించుకోండి గాని కొండగుహల్లో పోగు వేసుకోకండి, రేపటికోసం వస్తువులు దాచుకునే మనుష్యుల్లాగా" అనేవాడు. ఇలా క్రూరమృగాల్నటినీ హెచ్చరిస్తూ తన తపస్సు తాను చేసుకుంటూ ఉండేవాడు. సాధుజంతువులైన లేళ్లనూ, పిట్టలనూ దగ్గరకు తీసి ఒళ్లు నిమురుతూ వాటికి తన చేతిమీదుగా ఆహారం పెడుతుండే వాడు. ఇలా ఆయన ఆ అరణ్యానికంతటికీ ఓ విధంగా రాజు లాగ, గురువులాగ, సేవకుడిలాగ జీవిస్తున్నాడు. ఇన్ని జంతువుల్లో ఒకచిన్న కుక్కపిల్ల ఆయనకి ఎంతో అల్లారు ముద్దుగా, చనువుగా, దగ్గరగా మసలుతుండేది. నిజానికిదాన్ని చూస్తే ఎవరికైనా ముచ్చట కలుగుతుంది. పాలమీగడలాగ తెల్లని రంగుతో బొద్దుగా, ముద్దుగా ఆ కుక్కపిల్ల అటూ ఇటూ గెంతుతుంటే ప్రేమ స్వరూపికి సంతోషంగా ఉండేది. బాగా దగ్గరకుతీసి లాలించి పెంచేవాడు. దానికి ముద్దుగా 'సరమ' అని పేరుపెట్టుకొని, పేరుపెట్టి పిలిచి దాదాపు స్వంత బిడ్డలాగా పెంచుకుంటున్నాడు. ఇలా ఎవరి స్థానాల్లోవారు ఎవరి పనుల్లోవారు హద్దుమీరకుండా జాగ్రత్తగా జీవిస్తున్న కారణాన అది ఒక అరణ్యంలా కాకుండా ఓ మంచి కుటుంబం లాగా ఉండేది.

కాలం గడుస్తున్నది. కాలం గడిచేకొద్దీ జీవరాసి క్రమంగా పెరిగి పెద్దకావడం, కొత్తజీవులు పుట్టడం, పాత జీవులు గిట్టడం మొదలైన సంగతులు ఎవరికీ తెలికుండా జరిగి

పోతవి. ప్రేమస్వరూప్ పెద్దవాడయ్యాడు. బక్కచిక్కిన శరీరంతో, అక్కడక్కడా నెరసిన వెంట్రుకలతో, ఎల్లప్పుడూ తపస్సు చేయడం వల్ల కళ్ళల్లో గూళ్లుకట్టుకున్న కాంతులతో ఆయన ఒక వెలుగు ముద్దలాగ ఆ అరణ్యంలో ఉంటున్నాడు. సరమకూడా పెద్దదై మరింత బొద్దుగా, నున్నగా, అందంగా తయారైంది. మునీంద్రునికి ఇన్ని ఏళ్ళగా మచ్చిక కావడం వల్ల దాదాపు ఆయన నీడలాగ వెంటవెంట తిరుగుతూ, ఆయనకి చిన్నచిన్న పనులు చేసిపెడుతూ ఉండేది. అయన అగ్నిహోత్రానికి పుల్లలుకొట్టి దూరాన పెట్టి ఆశ్రమానికి తిరిగి వస్తే, తాను వెళ్లి పుల్లలను నోట కరచుకొని తెచ్చేది. పెద్దపెద్ద ఫలవృక్షాలనుండి పళ్లు రాలితే వాటిని నోటకరచుకొని తెచ్చి ఆశ్రమం అరుగుల మీాద పెట్టి ఎంగిలి సోకిందేమో అనే అనుమానంతో నది నీళ్ళలో తోకను ముంచి వచ్చి శోకాశించి పళ్ళమీాద నీళ్లు చల్లేది. చెట్లమీాద ఋషి ఆరవేసుకున్న బట్టలను జాగ్రత్తగా పళ్ళతో పట్టుకొని తెచ్చియిచ్చేది. ఇలా సరమ ప్రేమస్వరూప్‌కి సేవచేస్తూ ఉండటం, ఆయన దాన్ని ఇతర జంతువులకంటె ఎక్కువగా ప్రేమించడం తక్కిన జంతువులన్నిటికీ అసూయ కలిగించింది. కానీ అవి చాలాకాలం బయట పడలేదు.

ఒకనాటి రాత్రి అరణ్యమంతా శరత్కాలపు పున్నమి వెన్నెలతో ధగధగా మెరిసిపోతున్నది. ప్రకృతి అంతా ప్రశాంతంగా ఉన్నది. పులులూ, సింహాలూ, ఒంటెలూ,

ఎలుగుబంట్లూ, తోళ్లూ మొదలైన అన్నిరకాల జంతువులూ వెన్నెల అందాలను చల్లగాలి చందాలనూ ఆనందిస్తూ వాటి వాటి ప్రదేశాల్లో అవి సంచరిస్తున్నవి. ఆశ్రమం ముందున్న ఒక అరుగుమీద ప్రేమస్వరూప్ కూర్చుని సగం మూసిన కళ్ళతో ఆకాశంకేసి చూస్తూ ఏదో ధ్యానంలో ఉన్నాడు. కాళ్ళదగ్గర పడుకొనిఉన్న సరమ తోకాడిస్తూ యజమానికేసి చూస్తున్నది. ఇంతలో ధ్యానం ముగించి పడుకోబోతున్న మహర్షి కాళ్ళదగ్గర పడుకొనిఉన్న సరమని చూచి "ఏరా! ఇంకా పడుకోలేదా! వెళ్ళిపడుకో" అంటూ చేతితో మెల్లగా నిమురుతూ "పిచ్చిసన్నాసి! ఏ జన్మలోనో నా కొడుకువై యుంటావు" అన్నాడు. 'ఏ జన్మలోనో ఎందుకు స్వామీ! ఈ జన్మలోకాదా?' అన్నట్టు సరమ తోకాడించి తన తావుకు వెళ్ళిపోయింది. మహర్షి విశ్రమించాడు. ఆ పక్కనఉన్న పొదలచాటున నిప్పుకణికల లాగా మెరిసే కళ్ళతో ఓ చిరుత పులి ఈ దృశ్యాన్ని చూచింది. దానికి అరికాలిమంట నెత్తికెక్కింది. "ఔరా! ఎంత అన్యాయం. ఈ అడవిలో ఉండే మృగాలన్నీ మునీశ్వరుడి చెప్పుచేతుల్లో ప్రవర్తించి బ్రతుకుతున్నవి కదా! ఏ మృగంమీద లేని జాలి, ప్రేమ, దయ ఈ కుక్కమీద చూపిస్తున్నాడు. దీన్నిబట్టి తక్కినవన్నీ పనికిమాలిన మృగాలు, ఈ కుక్క ఒక్కటే ఉత్తమురాలు అన్న మాట. ఇదేం దేవలోకం నుండి దిగివచ్చిందా?, లేక దేవుని నోటొంచి ఊడిపడిందా? దీని అంతు తేల్చాలి. తపస్సు

చేసుకొనే మునీశ్వరులకే ఇంత పక్షపాతం ఉంటే సామాన్యుల సంగతేమిటి?" అని ఆలోచించి కోపంతో శివమెత్తినట్టు రుసరుసా నడచివెళ్ళి అప్పటికప్పుడు తక్కిన మృగాలన్నిటినీ సమావేశం చేసింది. తన మనస్సులోఉన్న అభిప్రాయాలన్నీ నిర్మొహమాటంగా అందరితో చెప్పింది. నిజానికి తక్కిన మృగాలకుకూడా ఇలాంటి అభిప్రాయాలే ఉన్నవి. తాము బయట పడలేదు. చిరుతపులి బయటపడి అక్కడ వెళ్ళగక్కింది. తక్కిన మృగాలన్నీ చిరుతపులితో ఏకీభవించాయి. నిజమే. మా మనస్సులలో కూడా ఇలాంటి అభిప్రాయమే ఉన్నది. కానీ ఏం చేద్దాం? కానీ ఏం చేద్దాం? ఈ ప్రశ్నే అన్ని మృగాలకీ ఎదురైంది. సమాధానం దొరకలేదు. చాలా సేపు చర్చించి ఒక పరిష్కారం మనస్సుకి తట్టిన తరువాత వాటి తావులకి అవి వెళ్ళిపోయాయి.

తెలతెల వారుతున్నది. అప్పుడే తూర్పు దిక్కునుండి తొంగిచూస్తున్న వెలుగు రేఖలతో, పక్షుల కిలకిలా రావాలతో అరణ్యం మేలుకొన్నది.



ప్రిమస్వహాప్ ఆనాడుకూడా రోజూలాగే చేసే హోమం చేస్తున్నాడు. ఇంతలో ఎవరో తరుముకొని వస్తు న్నట్టు ప్రాణభయంతో పెద్దగా అరుస్తూ చావు కోరల్లో నుంచి తప్పించుకొని ఇవతల పడ్డట్టు సరమ వచ్చి హోమంచేసే

వేదిక దగ్గరకువచ్చి మునీశ్వరుని పరిక్కన పడిపోయింది. దాన్ని తరుముకొని చిరుతపులి వస్తున్నది. పరిస్థితి ఇట్టే గమనించిన ప్రేమస్వరూప్ కమండలంలోని నీళ్ళను మంత్రించి కుక్క మీద చల్లాడు మరుక్షణంలో అదికూడా చిరుతపులి గా మారిపోయింది. ముందువచ్చిన చిరుతపులికంటే ఎత్తుగా, బలంగా, మెరిసిపోతున్న చారలతో, భయంకరమైన కోరలతో ఆ మొదటి పులిని వెంబడించి తరిమికొట్టడమే కాకుండా దాని శరీరం నుండి ఒక మాంసపు ముక్కను కోరలతో పెకిలించి తీసుకొనివచ్చి దూరంగా నిలబడి మహర్షి చూచి సంతోషంతో తలఊపేదాకా నిలువబడి వెళ్లిపోయింది.

ఈ సంగతి తెలుసుకున్న తక్కిన క్రూరమృగాలకు మనస్సులో పగ ఇంకా ఎక్కువైంది కాని చల్లబడలేదు. మరునాడు ఒక పెద్ద ఏనుగు కండలు బాగా పెరిగి ఒక కదలివస్తున్న పర్వతంలాగా ముందుకు దూసుకొని వచ్చిన దంతాలతో వచ్చి ఓ మూల ఒదిగిఉన్న చిరుతపులి రూపంలో ఉన్న సరమను గట్టిగా కుమ్మింది. అది గమనించిన ప్రేమస్వరూప్ కమండలంలోని మంత్రజలంతో నిమిత్తం లేకుండానే సరమను ఓ పెద్ద ఐరావతమంత ఏనుగుగా మార్చి వేయడం. ఈ ఏనుగు వెళ్లి ముందువచ్చిన ఏనుగును ఢీకొని దంతాలు విరగబొడిచి తొండం తునాతునకలయ్యేట్లు చేసింది. మరొకసారి తన సరమను రక్షించుకొన్నందుకు మునీశ్వరుడు తృప్తిపడ్డాడు. కాని కథ పూర్తికాలేదు.

ఇంకోనాడు భయంకరమైన బెబ్బులి వచ్చి ఏనుగు రూపంలో ఉన్న సరమను ఎదుర్కొన్నది. ఈ సారి మునీశ్వరుడు ఆ బెబ్బులికి రెండింతలు శరీరం, ఎన్నో రెట్లు పరాక్రమం గల బెబ్బులిగా మార్చాడు. మునుపటిలాగే ఈ బెబ్బులి మొదటి బెబ్బులిని తరిమికొట్టడమే కాక చీల్చి ముక్కలు చేసింది.

ఆ తరువాత ఒక భయంకరమైన సింహం వచ్చింది. అది నిజంగా ఆఅడవికి మొత్తం రాజుగా ఉంటున్న మృగరాజు. భూమి, ఆకాశం దద్దరిల్లేలాగా గర్జిస్తూ, తోక నిక్కబెట్టుకొని భయంకరమైన జూలు విదిలించి, ఎఱ్ఱని కన్నులతో, ధగధగా మెరుస్తున్న కోరలతో ఈసారి కథ అటో ఇటో తేల్చాలని పూనికతో ఒక్కదూకున వచ్చి బెబ్బులి రూపంలో ఉన్న సరమను పట్టేసింది. ఇంకేం మహర్షి సంకల్పం వల్ల సరమ ఒక మహాసింహంగా మారి మొదటి సింహాన్ని ఇట్టే చిత్తు చేసింది. మొదటి సింహం ఒంటినిండా గాయాలతో పలాయనం చిత్తగించింది. ఇప్పుడు సింహం రూపంలో ఉన్న సరమ ఇలా ఆలోచించుకున్నది. "ఇన్నాళ్ళుగా నన్ను ఈ అడవి లోని మృగాలు కక్షగట్టి వెంబడించడం ఈ ఋషి నన్ను రక్షించడం జరుగుతున్నది. ఇప్పుడు నాకు ఏవిధమైన ఆపదా రాదు. నేను సింహాన్నైపోయాను. ఈ అరణ్యంలోని మృగాలన్నీ నా దెబ్బకు రద్దు. ఇంక నన్ను ఎదుర్కొని ఎవ్వరూ జయించలేరు. నేనే ఈ అరణ్యానికి రాజును. ఇప్పుడు

ఇంకోనాడు భయంకరమైన బెబ్బులి వచ్చి ఏను గు రూపంలో ఉన్న సరమను ఎదుర్కొన్నది. ఈ సారి మునీశ్వరుడు ఆ బెబ్బులికి రెండింతలు శరీరం, ఎన్నోరెట్లు పరాక్రమం గల బెబ్బులిగా మార్చాడు. మునుపటిలాగే ఈ బెబ్బులి మొదటి బెబ్బులిని తరిమికొట్టడమే కాక చీల్చి ముక్కలు చేసింది.

ఆ తరువాత ఒక భయంకరమైన సింహం వచ్చింది. అది నిజంగా ఆఅడవికి మొత్తం రాజుగా ఉంటున్న మృగరాజు. భూమి, ఆకాశం దద్దరిల్లేలాగా గర్జిస్తూ, తోక నిక్కబెట్టుకొని భయంకరమైన జూలు విదిలించి, ఎఱ్ఱని కన్నులతో, ధగధగా మెరుస్తున్న కోరలతో ఈసారి కథ అటో ఇటో తేల్చాలని పూనికతో ఒక్కదూకున వచ్చి బెబ్బులి రూపంలో ఉన్న సరమను పట్టేసింది. ఇంకేం మహర్షి సంకల్పం వల్ల సరమ ఒక మహాసింహంగా మారి మొదటి సింహాన్ని ఇట్టే చిత్తు చేసింది. మొదటి సింహం ఒంటినిండా గాయాలతో పలాయనం చిత్తగించింది. ఇప్పుడు సింహం రూపంలో ఉన్న సరమ ఇలా ఆలోచించుకున్నది. "ఇన్నాళ్ళుగా నన్ను ఈ అడవిలోని మృగాలు కక్షగట్టి వెంబడించడం ఈ ఋషి నన్ను రక్షించడం జరుగుతున్నది. ఇప్పుడు నాకు ఏవిధమైన ఆపదా రాదు. నేను సింహాన్నైపోయాను. ఈ అరణ్యంలోని మృగాలన్నీ నా దెబ్బకు రద్దు. ఇంక నన్ను ఎదుర్కొని ఎవ్వరూ జయించలేరు. నేనే ఈ అరణ్యానికి రాజును. ఇప్పుడు

మాయపేరై మనుషుల మన్నన పొందుతారు. లేకపోతే నశించి పోతారు."

అంటూ పద్మాసనం వేసుకొని కూర్చుని ధ్యానంలో మునిగిపోయాడు. ఆయన శరీరంలో నుంచి ఒక వెలుగు ఆకాశంలో లీనమైనది. ఈ పరిస్థితి ఊహించని కుక్క దుఃఖించి కన్నీరు కార్చింది.

(ఈ కథలో ఋషి నిజంగా ప్రేమస్వరూపుడు. తనను ఆశ్రయించుకున్న కుక్కని ఎన్నోసార్లు కాపాడాడు. కాని ధర్మం తప్పితే ప్రేమకూడా పనిచేయదు కాబట్టి కుక్క తాను చేసిన తప్పుకి శిక్ష అనుభవించింది. అయితే ప్రేమస్వరూప ఋషికాబట్టి కుక్కకి శాపంలాంటి వరం, వరంలాంటి శాపం ఇచ్చి తనకేమీ పాపం గాకుండా తన తపశ్శక్తి వృథా కాకుండా కాపాడుకున్నాడు. అందువల్లనే మన పెంపుడు జంతువులలో కుక్కలకి ఒక ప్రత్యేకత ఉన్నది. విశ్వాసానికీ తెలివి తేటలకీ, సేవాధర్మానికీ వాటిని చెప్పి ఇతర జంతువులని చెప్పాలి. అరణ్యంలోని జంతువులన్నీ అసూయతో నిండిన మనుషుల లాంటివి. అందుచేతనే తమ అసూయకి తగిన ఫలితం అప్పటికప్పుడు అనుభవించాయి.

ఈ కథవల్ల అసూయ, చేసిన మేలుమఱచిపోయే స్వభావం అనే పాపాలకు మనిషి దూరంగాఉండి మంచిపనులుచేస్తే తనకీ, పొరుగువారికీ మంచిదనీ, ఈ ధర్మాలను వదిలిపెట్టి తప్పుదోవ పట్టినవారు అప్పటికప్పుడు శిక్ష అనుభవిస్తారనీ వ్యాస మహర్షి బోధిస్తున్నారు.)

# పగపట్టిన పిట్ట

బ్రహ్మదత్తుడు అనే పేరుగల రాజు మాళవ రాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. అతనికి ధర్మప్రభువు అనే పేరున్నది. ప్రజలను కన్నబిడ్డల లాగా చూచుకుంటూ వారికి కావలసిన అన్ని సౌకర్యాలూ కల్పిస్తూ చక్కగా పరిపాలించేవాడు. అంతేకాదు. మనుష్యులను ఎంత ప్రేమగా చూస్తాడో తన రాజ్యంలోని పశుపక్ష్యాదులను కూడా అంతే ప్రేమగా చూచేవాడు. అంత భూతదయ, అన్ని జీవాలమీద సమానమైన ఆదరణ ఆయనకి ఉన్నదానికి నిదర్శనంగా తన రాజభవనంచుట్టూ ఒక పెద్ద తోట పెంచాడు. అందులో రకరకాల పూలచెట్లు, పళ్ళచెట్లు, కొలనులు, చిన్నచిన్న కొండలు, వాటిమధ్య అందంగా తీర్చి దిద్దిన బాటలు ఏర్పాటుచేసి ఆ తోటను ఒక నందనవనంలాగ చేశాడు. ఆ తోటలో రకరకాల పిట్టలు, చిన్నచిన్న జంతువులూ హాయిగా తిరుగుతూ ఉండేవి. రాజ భవనానికి చాలా దగ్గరగా ఉన్న ఒకచెట్టుమీద చిలకాగోరింకా గూడుకట్టుకొని నివసిస్తూ ఉండేవి. వాటిని చూచినప్పుడల్లా బ్రహ్మదత్తుడు చాలా ముచ్చట పడుతుండేవాడు. రాజసభకి వెళ్ళేప్పుడు, సాయంకాలం తోటలో షికారుకి వెళ్ళేప్పుడూ కాస్సేపు ఆగి గోరింకతో కబుర్లుచెప్పి కాలక్షేపంచేసి మరీ వెళ్లేవాడు. నిజానికి

ఆ గోరింకకు పేరు అంటూ ఏమీ లేకపోయినా రాజు దాన్ని ముద్దుగా 'పూజని' అని పిలిచేవాడు. గోరింక దంపతులు రాజు తమమీద చూపిస్తున్న ప్రేమాభిమానాలకు పరవసించి పోయేవి. ఒకలాగ చెప్పాలంటే రాజు పూజనిదంపతులను తన ఇంట్లో మనుషులలాగ చూచుకొనేవాడు. రాణి, ఆమె దాసీలుకూడా గోరింక కుటుంబంమీద అలాంటి ప్రేమనీ అప్యాయతనీ చూపించేవారు. పూజనిమాత్రం రాజు తన కిచ్చిన మర్యాదనీ, తన మీదచూపే ప్రేమనీ దుర్వినియోగం చేయకుండా హద్దు మీరకుండా చాలా వినయంతో ప్రవర్తిం చేది. అసలు బ్రహ్మదత్తుడు పూజని మీద అంత ప్రేమ చూపించడానికి ఒక ముఖ్యమైన కారణం ఉన్నది. పూజని చాలా చక్కగా మాట్లాడుతుంది. దానికి అనేక ధర్మ శాస్త్రాలూ, కథలు, కళలు తెలుసు. రాజు తనలో తాను ఆశ్చర్య పడుతుండేవాడు. పక్షి పుటక ఏమిటి? ఇంతటి పాండిత్యం ఏమిటి? ఇది పూర్వజన్మలో గొప్పపండితుడై యుంటుంది. ఆజన్మలో సంపాదించుకొన్న పాండిత్యంతో బాటు ఏదో చిన్నపాపంచేసి ఉంటుంది. బహుశా ఆ కర్మశేషం తీర్చుకోవడానికి ఈ జన్మ ఎత్తిఉంటుంది అని ఆయన అభి ప్రాయం. ఒకటి రెండుసార్లు మహామంత్రితో కూడా అన్నాడు ఈ విషయాన్నే. మహామంత్రికూడా 'కావచ్చు ప్రభూ' అంటూ అంగీకరించాడు.

ఓనాటి సాయంకాలం రాజు సరదాగా రాణితో కలిసి తోటలో విహరిస్తున్నాడు. 'మహా ప్రభువులకు జయము. మహారాణికి జయము' అంటూ పూజనివచ్చి ఓ చెట్టుమీద వాలింది. రాజు రాణి దాన్ని ఆప్యాయంగా పలకరించారు. 'బాగున్నారా ప్రభూ' అంటూ రాణికేసి తిరిగి 'మీకో మంచి కానుక తెచ్చాను. ఏం తెచ్చానో చెప్పుకోండి' అంటూ చిలిపిగా నవ్వింది.

'నాకు కానుకేమిటే పిచ్చిమోహమూ. ఆ కానుకేదో మీ రాజుగారికే ఇచ్చుకో'

'ఇది రాజుగారికి ఇచ్చేది కాదులేండి. మీకోసమే తెచ్చాను. మీకే ఇస్తాను. కాని ఒక్కషరతు'

'షరతేమిటే నీముఖం అసలు ఏం తెచ్చావుచెప్పు'

'ఏం తెస్తాను. మీకు ఇలాంటప్పుడు ఏవి తినాలని పిస్తుందో అవే తెచ్చాను. ఇక్కడెక్కడా దొరికేవికావు. హిమాలయ పర్వతాలదగ్గర కోసుకొచ్చాను. పుల్ల పుల్లగా తియ్యతియ్యగా నోరూరించే అడవి రేగుపళ్ళు' అంటూ రాణి ముఖంకేసి పరీక్షగా చూచింది. రాణి అర్థంచేసుకొని 'నీకెలా తెలిసిందే ఈ ముచ్చట' అంటూ తలవంచుకొని నవ్వింది.

'నాకు తెలుసులేండి మహారాణీ. ఇంతకీ నా షరతు విన్నారు కారు. ఇప్పుడు రాజుగారి సమక్షంలో మీకు పుట్టే మగపిల్లాడు కావాలో అందాల ఆడపిల్ల కావాలో

మోహామాటం లేకుండా చెప్పండి. బోలెడు పళ్ళు మీకిస్తాను' రాణి సిగ్గుతో కుంచించుకొని పోయింది. 'పోనీ మీరుచెప్పండి మహారాజా' రాజు ఈ మాటలు విని ఆనందంతో పరవశుడై నాడు. 'నన్నడిగితే మగపిల్లాడే అంటాను' అన్నాడు. బంగారు రంగుతో నిగనిగ లాడుతున్న పళ్ళను తీసుకొనివచ్చి రాణి ఒడిలో ఉంచి 'పండంటి బాబును కనండి మహారాణీ' అన్నది. రాజదంపతులకు ఆనందంతో కళ్ళు చెమ్మగిల్లాయి. 'ఎంత మంచి దానవే మరి నీకెప్పుడే ఈ ముచ్చట.' అన్నాడు రాజు. 'నాకూ ఇలాగే ప్రభూ, కొన్నిపళ్ళు నా ఇల్లాలికీ ఇచ్చి వచ్చాను. బహుశా ఇద్దరూ ఓసారే కంటారు' అంటూ రివ్వున ఎగిరిపోయింది.



పూజని చెప్పినట్టే మహారాణికి మగపిల్లవాడు పుట్టాడు. అదేసమయాన పూజని భార్యకికూడా మగసంతానం కలిగింది. లేకలేక కలిగిన సంతానం కావడంవల్ల బ్రహ్మదత్తుడు రాజ్య మంతా వేడుకలుచేసి, వేదం చదువుకున్న బ్రాహ్మణులకి అనేక దానాలుచేసి పిల్లవానికి సూర్యదత్తుడు అని పేరుపెట్టి గారాబంగా పెంచుకుంటున్నాడు. ఒకరోజు పూజనిని పిలిచి 'మీ అబ్బాయి మెళ్లో ఈ హారం వేసుకోవే' అంటూ నవ రత్నాలు పొదిగిన విలువైన హారం బహూకరించింది. 'చూశావా

మహారాణి. పళ్ళిచ్చి రాళ్ళుపొందిగిన బంగారుదంప తీసుకుంటు న్నాను' అంటూ ప్రక్కనేఉన్న రాజునుచూచి 'ఇంతే మహా రాజా! మనం మంచిచేసినా చెడుచేసినా ఇంతకింతగా ఈ జన్మ లోనే అనుభవిస్తాము.' అన్నది.

సూర్యదత్తుడు తప్పటడుగులు వేస్తున్నాడు. దాసీలు ఏమరపాటు లేకుండా అతని అచ్చట ముచ్చట, ఆలన పాలన, పెంపు సొంపులు చూస్తుంటే క్రమంగా పెరుగుతున్నాడు. అసలే రాజపుత్రుడు, ఆపైన అందమైనవాడు కాలు క్రింద పెట్టకుండా గారాబంగా పెరుగుతున్నాడు.

రోజూ ఎక్కడికో ఎగిరివెళ్ళి వచ్చి రకరకాల రుచిగల పళ్ళను పూజని తెచ్చి కొన్ని తన కొడుక్కీ, కొన్ని సూర్యదత్తు డికీ ఇస్తుండేది. రాజకుమారుడు ఆ పళ్ళని ఆప్యాయంగా తింటుండేవాడు. చెట్లమధ్య పిట్టలతో, లేళ్ళతో, నెమళ్ళతో ఆడుకుంటుండే వాడు. ఇప్పుడు అయిదేళ్ళ పిల్లాడయ్యాడు. తోటలో తిరిగేటప్పుడు కొంచెం చెయ్యిదురుసు చూపిస్తూ జంతువులనీ, పిట్టలనీ కొడుతుండేవాడు. ఒకసారి సూర్యదత్తుడు చిన్న లేడిపిల్లని కాలితో ఫకాలించి తన్నాడు. అది అల్లంత దూరాన వెళ్ళిపడ్డది. సరిగా ఆ సమయానికి అక్కడికి వచ్చిన పూజని రాజకుమారుణ్ణి చూచి కోపంగా "ఏంపని చేశావు బాబూ. నిన్ను ఎవరైనా అలా తంతే నీకెలా ఉంటుంది.

ఇలాంటి తప్పుపని చేయకు" అంటూ గట్టిగా మందలించి వెళ్ళి పోయింది. సూర్యదత్తుడు పూజని వేపు కొరకొరా చూచాడు.

పూజని కొడుకూ, సూర్యదత్తుడూ దాదాపు ప్రతిదినమూ సాయంకాలం పూలతోటలో ఆడుకుంటుండేవారు. పూజని తెచ్చిన పళ్ళని తింటుండేవారు. ఆట, చెర్లాట, తగూలాట అన్నీ కలిసి ఉండే వాళ్ళఆటలో పూజని కొడుకును ఒక్కోసారి సూర్యదత్తుడు పిడికిట్లో బిగించి నలుపుతుంటే అది గిలగిలలాడి పోయేది. దగ్గరఉన్న దాదివచ్చి విడిపించేది. ఇలా కొన్నాళ్లు గడిచాయి.

ఆనాటి సాయంకాలం మామూలుగా పళ్ళను తెచ్చి తోటలోఉన్న అరుగుమీద ఉంచి వెళ్ళిపోయింది పూజని. పని తొందరలో దాసి ఆనాడు సూర్యదత్తుని వెంటరాలేదు. అరుగు మీద పళ్ళు, ఒకవేపు సూర్యదత్తుడు, మరోవేపు పూజని కొడుకూ ఉన్నారు. రోజూలాగే వాళ్ళఆట సరసంగా మొదలై విరసంగా మారిపోయింది. ఎవరూ ప్రక్కన లేకపోవడంతో సూర్యదత్తుడు ఆవేశంతో విజృంభించి పూజని కొడుకుని రెండు చేతుల్లో బిగించి నొక్కి మెడవిరిచి పారేశాడు. గిల గిలా తన్నుకొని ఆపిట్ట చచ్చిపోయింది.

ఇంతలో అక్కడికి వచ్చిన పూజని జరిగినదంతా అర్థం చేసుకొన్నది. ఆ క్షణంలో దానికి ఒళ్ళు తెలీలేదు. దివ్యాన

సూర్యదత్తుని మీదికి దూసుకొనివచ్చి తన ముక్కుతో అతని కనుగుడ్లు రెండూ పొడిచి పట్టుకొనిలాగి బయటపడేసి తన కసి తీర్చుకొన్నది. ఆకాశానికి ఎగిసింది. ఇంతలో బ్రహ్మదత్త మహారాజు అక్కడికి వచ్చాడు. అరుగుమీద చచ్చిపడి ఉన్న పిట్ట, ఆ ప్రక్కన రక్తపుమడుగులో పడి లొత్తలైన కళ్ళతో బాధపడుతున్న సూర్యదత్తుడూ- ఈ దృశ్యంచూచి రాయిలాగ మారిపోయాడు. ఏమయిందో అర్థంకాలేదు. 'మహారాజా' అన్నమాటలు వినిపించాయి. చెట్టు కొమ్మమీద నుండి పూజని ఇలా చెప్పింది. "మీ కొమారుడు నా ఏకైక సంతా నాన్ని చేజేతుల నలిపి చంపేశాడు. నేను పగతీర్చు కున్నాను. అతని కనుగుడ్లు పీకివేశాను.ఇది ఆవేశంలో జరిగిన పని అనిగాని, నేను పొరపాటు చేశాననిగాని అనుకోవడంలేదు. అతను ఘోరపాపం చేశాడు. ఆపాపానికి తగిన ఫలితం అనుభ వించాడు. ఏమంటావు?" అన్నది పూజని.

బ్రహ్మదత్తుడు ఒక్కక్షణం ఆలోచించాడు. కన్నులు చెమ్మగిల్లినవి. లేక లేక కలిగిన వంశాంకురం గుడ్డివా డయ్యాడు అన్న బాధ ఒకవైపు, తనను నమ్ముకొని తన ఇంట్లో మనిషిలా ప్రవర్తించిన పూజనికి తన కుమారునివల్ల తీరని అన్యాయం జరిగిందన్న బాధ ఒకవైపు ఈ రెండు బాధల మధ్య మాళవ దేశాన్ని పరిపాలించే ధర్మప్రభువుగా తన బాధ్యత ఈ మూడు విషయాలూ మనస్సులో ఆలోచించు

కొని, ఉత్తరీయంతో కన్నీరు తుడుచుకొని గంభీరమైన కంఠంతో ఇలా అన్నాడు.

"సెబాస్ పూజనీ సెబాస్, చాల మంచిపని చేశావు. నీ స్థానంలో నేనున్నా అలాగే చేసేవాడిని. నిజానికి ఒకనిండు ప్రాణాన్ని బలిగొన్న దుర్మార్గుడికి కళ్ళుపీకడం అన్నదండన చాలదు. వాణ్ణి నిలువున చంపేయాల్సింది. నువ్వెంతో జాలితో, బహుశా పళ్ళు పెట్టి పెంచి పెద్దచేసిన మమకారంతో వాడి ప్రాణాలు తీయలేదు. పుత్రశోకం నువ్వుపొందిన అంతకన్న చాలా తక్కువైన దుఃఖాన్నే నాకిచ్చావు. నీ ధర్మబుద్ధివల్ల నేనే నీకు ఋణపడి ఉన్నాను. నీ కుమారుని ప్రాణాలు నేను తెచ్చి యివ్వలేను కదా!" అన్నాడు.

"నేనుమాత్రం మీ కుమారుడి కళ్ళు తెచ్చి ఇవ్వగలనా! పోనీయండి. నాకు సెలవిప్పించండి. ఇన్నాళ్లు నన్ను కన్న బిడ్డలాగ చూచుకొని కాపాడిన మీకు కడసారి వందనం చేస్తున్నాను." అంటూ పూజని రెక్కలల్లార్చింది, బయలు దేరడానికి సిద్ధపడుతూ.

"ఆమాట మాత్రం అనకు పూజనీ. నీవు వెళ్ళడానికి వీలులేదు. ఇందులో నీ తప్పేమిలేదు. తప్పుచేసినవాడు శిక్ష అనుభవించాడు. రాజ్యాన్ని ఏలేరాజును నేను ఆ శిక్షను సమర్థించాను. నువ్వు వెళ్ళవలసిన అవసరం ఏమిటి?" అన్నాడు రాజు.

"అలా అనకండి ప్రభూ. మీరు ధర్మప్రభువులు కనుక నేను చేసినపనిని ధర్మదృష్టితో చూచి ఆమోదించాడు. అంత మాత్రం చేత మీ మనస్సులో పగలేకుండా పోతుందా? రాజ్యాన్ని పరిపాలించే ధర్మానికి తగినట్టు తీయని మాటలు చెబుతున్నారు"

"అంటే నీ ఉద్దేశం నేను లోపల ఒకటి ఉంచుకొని పైకి ఇంకోటి మాట్లాడే మోసగాణ్ణి అనా?"

"క్షమించండి నాకలాటి ఉద్దేశం లేదు."

"మరి?"

పూజని సమాధానం చెప్పలేదు.

బ్రహ్మదత్తుడు అంటున్నాడు. 'చేసిన తప్పుకి తగ్గశిక్ష పడ్డ తరువాత పగ అనే అభిప్రాయమే కలుగదు. అలాంటి సందర్భాలలో ఎంత తుచ్ఛుడైనా, నీచుడైనా పగ రగిలించుకోడు.'

'అలా అనకండి. స్నేహం చెడిపోయినా, తియ్యదనంతో పగ తాత్కాలికంగా మాటుపడినా, ఎల్లకాలమూ అలాగే ఉంటుందనడానికి వీల్లేదు'

'ఎంచేత?'

'చావువల్ల నష్టంవల్ల వచ్చిన పగకి తిరుగులేదు. అది కొయ్యలో అగ్నిలాగ, సముద్రంలో బడబాగ్నిలాగ

## ఇద్దరు రాజులూ - ఇద్దరు ఋషులూ

సూర్యాస్తమయం కావస్తున్నది. ఒక పెద్ద అడవి. ఆ అడవిలో ఒకమూల విల్లంబులు ధరించిన మహారాజు తన చూపును అటూ ఇటూ తిప్పకుండా గురిపెట్టిన బాణంతో ఒక సన్నని బాటవెంట వెళ్ళుతున్నాడు. అంతకు ముందే కొన్ని క్షణాల క్రిందట ఒక బంగారువన్నె లేడిపిల్ల నిగనిగా మెరుస్తూ అమాయకమైన కళ్ళతో రాజుకేసి చూస్తూ, అప్పుడప్పుడూ చిన్నచిన్న గడ్డిపరకలు కొరుకుతూ, రాజు తీరా గమనించి విల్లు ఎక్కుపెట్టేసరికి ఛెంగుఛెంగున దూకుతూ వెళ్ళిపోయింది. అంత అందమైన లేడిని ఆ రాజు తన జీవితంలో ఎప్పుడూ చూడలేదు. ఆ రాజుపేరు సుమిత్రుడు. హైహయ వంశానికి చెందినవాడు కురు రాజ్యాన్ని పరిపాలించే ఆ రాజు క్షత్రియులకు సహజమైన వేటమార్గంలో అలా వచ్చాడు. ఆ బంగారు లేడిని ఎలాయినా కొట్టాలని అతని ఉద్దేశ్యం. అంచేతనే ఏకాగ్రితతో వెంబడిస్తున్నాడు. ఎంతో దూరం నడచి వెళ్ళాక అల్లంత దూరాన ఓ పొదరింటి దగ్గర గడ్డిమేస్తున్న లేడిపిల్లను చూచి చిక్కింది ఇంకెక్కడికి పోతుంది అని గబగబా వెంబడించాడు. మళ్ళీ ఆ లేడిపిల్ల అక్కడినుంచి బయలుదేరి పరుగు లంకించుకున్నది. ఇంకా వేగంగా వెంబడించాడు సుమిత్రుడు.

ఈసారి లేడి జాడకూడా కనుపించలేదు. సుమిత్రుడు ఆలోచనలో పడ్డాడు. తన అనుభవంలో ఇంత చిన్న మృగం కోసం ఇంత శ్రమపడ్డది లేదు. ఇదేమన్నా మాయలేడా? అని అనుమానం వచ్చింది రాజుకు. ఈ అనుమానంతో అతని పట్టుదల మరింత ఎక్కువైంది. దీని సంగతి ఇవ్వాళ అటో ఇటో తేల్చుకోవాలి అనుకొని జాగ్రత్తగా నేల చూపులు చూస్తూ కొంతదూరం వెళ్ళాడు. అక్కడ నేల కొంచం తడిగా ఉండడంవల్ల లేడి కాలిగుర్తులు కనుపించాయి. ఆ గుర్తులను పట్టుకొని మఱికొంత దూరం వెళ్ళాడు. ఆ గుర్తులు ఒక కొలను దగ్గరకు దారితీసి ఆగిపోయాయి. దాన్నిబట్టి ఆ లేడి కొలనుదాకా నడచివచ్చి కొలనుదాటి అవల ఒడ్డుకు వెళ్ళిందని ఊహించి తానూ అలాగే కొలను ఈదుకొని అవతలి ఒడ్డుచేరాడు. ఈ సారి కాలిగుర్తులు కనుపించలేదు. ఆ పరిసరాల్లో ఉన్న చెట్లూ చేమా పుట్టా గుట్టా వెదికాడు. లేడి కనుపించలేదు. ఇలా చాలాసేపు తిరగడంవల్ల సుమిత్రుడు బాగా అలసిపోయాడు. ఇంక ఒక్క అడుగు కూడా పెట్టలేనంత నీరసం వచ్చింది. ఇంతలో బాగా చీకటి పడింది. ఇప్పుడేం చేయాలో అతనికి తోచలేదు. ఇంతలో దూరాన్నుండి వేదమంత్రాలు చదువుతున్న ధ్వని వినిపించింది. మెల్లగా అడుగుతీసి అడుగువేస్తూ ఆ ధ్వనినిబట్టి ప్రయాణం చేసి ఆ ప్రదేశానికి వెళ్లాడు.

అది ఋషభుడు అనే మహర్షి ఆశ్రమం. ఋషభుడు అప్పుడే తన సాయంకాల సంధ్య అగ్నిహోత్రము మొదలైన కార్యక్రమాలు ముగించుకొని ఆశ్రమం మట్టిచెట్టు నీడన ఉన్న అరుగుమీద కూర్చుని శిష్యులతో సహా ఫలాలు తిన బోతున్నాడు. ఆ సమయానికే సుమిత్రుడు అక్కడకు చేరాడు. ఆతన్ని చూచి ఋషభుడు స్వాగతం అడిగి మొదట మంచినీళ్లు తరువాత మంచి మంచి పళ్ళుఇచ్చి అతను బాగా సేద తీర్చు కున్నాక "మహారాజా కుశలమా! ఏమిటి ఈ వేళప్పుడు ఇలా విచ్చేశారు?" అంటూ ప్రేమగా కుశలప్రశ్న వేశాడు. ఋష భుని ప్రశ్నలకు సుమిత్రుడు సమాధానం చెప్పి ఆనాడు బంగారు లేడిని వెంటాడి తానుపొందిన కష్టాలన్నీ చెప్పి ఇలా ప్రార్థించాడు. 'మహర్షీ ఈ బంగారులేడి కారణంగా తమ దర్శన భాగ్యం కలిగింది. చాలా ఆనందమైనది. రాజులము మేము మిమ్మల్ని కోరకా తప్పదు. మీ దయవల్ల మా కోరి కలు తీరకా తప్పదు. నాకో చిన్న ఉపకారం చేసిపెట్టండి. మీ దివ్యదృష్టిచేత చూచి ఆ లేడి ఎక్కడఉన్నదో చెప్పండి. ఏడేడు లోకాల్లో ఎక్కడ దాగిఉన్నా దాన్నిపట్టి వధించాలి.' ఋషభుడు మెల్లగా నవ్వి అన్నాడు. "మహారాజా ఆ లేడిని పట్టాలని మీకు పట్టుదలగా ఉన్నదా? లేక ఆ లేడి మీ స్వంతం కావాలని ఆశగా ఉన్నదా?"

'రెండూను'

'అలాగే చూద్దాం. బాగా పొద్దుపోయింది ఈ రాత్రికి మీరు ఇక్కడే విశ్రాంతి తీసుకోండి. రేపు ఉదయం ఆలోచిద్దాం.'



తెల్లవారింది. మహర్షి మహారాజు తమ ప్రాతఃకాల కార్యక్రమాలను పూర్తిచేశారు. మహర్షితో బాటు మహారాజుకూడా సంధ్య, అగ్నిహోత్రము మొదలైన కార్యక్రమాలు పూర్తిచేశాడు. ఋషభుడు తన శిష్యులకి రోజూలాగే వేదం పాఠంచెప్పి ఆ శిష్యులందఱితో పెద్దవాడైన ఒకణ్ణి పిలిచి "చిరంజీవీ. నేను చాలా ముఖ్యమైన పనిమీద తనువు మహర్షి ఆశ్రమానికి వెళ్ళుతున్నాను. మళ్ళీ వచ్చేసరికి నాలుగైదు రోజులు పడుతుంది. ఈ లోపున ఆశ్రమం ఆలనా పాలనా నువ్వేచూడాలి" అన్నాడు. చిరంజీవి తలవంచి నమస్కరించి "చిత్తం" అన్నాడు. ఋషభుడు సుమిత్రుని వైపుచూచి "రండి మహారాజా" అన్నాడు. ఏమీ అర్థంకాక పోయినా చేసేది లేక మహారాజు మహర్షి వెంట బయలుదేరాడు.

మధ్యాహ్నకాలం అయ్యేసరికి వారిద్దరూ తను మహర్షి ఆశ్రమానికి చేరుకున్నారు. దూరంనుండే హోమపు పొగ ఆశ్రమంలోని పూలచెట్ల మీదుగా బయలుదేరివచ్చి సుగంధాన్ని చల్లదనాన్ని అందించి వారికి స్వాగతం చెప్పింది. స్వరయుక్తంగా చదువుతున్న వేదమంత్రాలు పక్షుల కిలకిలా

రావాలతో కలిపి అతిథులకి ఆనందం కలిగించాయి. తనూ మహర్షి ఆశ్రమం బాగా పెద్దది. చుట్టూ రకరకాల పూల మొక్కలు, ఫలవృక్షాలు కూరగాయలు బాగా ఏపుగా పెరిగి ఉన్నవి. లోపలికి చక్కనిబాట, బాటచుట్టూ అందమైన పూల చెట్లు. ఒక వేపున చక్కని కొలను. ఆ కొలను గట్టున ఒక దేవాలయం. లోపల ఎక్కడో కులపతి తను మహర్షి నివాసం. దానిచుట్టూ ఇతర ఋషుల, ఋషి బాలకుల కుటీరాలు. ఆ వాతావరణమంతా చాలా హాయిగా ప్రశాంతంగా ఉన్నది. ఋషభ సుమిత్రులు ఆశ్రమంలోపలికి వెళ్లి తనూ మహర్షికి నమస్కారం చేశారు. ఆయన ప్రతి నమస్కారంచేసి కుశల ప్రశ్నలువేసి అర్ఘ్యము, పాద్యము మొదలైన ఉపచారాలు చేశాడు. అందరూ విశ్రాంతిగా కూర్చున్న తరువాత 'ఏమి ఋషభ మహర్షీ ఇలా విచ్చేశారు. వీరెవరు?' అంటూ సుమిత్రునివైపు చూచాడు. తనూ మహర్షి చాలా ముసలి వాడు. ఎన్నో ఏళ్ళుగా తపస్సుచేత, కఠిన నియమాలచేత ఆయన శరీరం బాగా చిక్కిపోయి ఎముకలగూడల్లేఉంది. ముగ్గు బుట్టలాంటి వెంట్రుకలు. కళ్ళుమాత్రం వెలుగుతున్న దీపాల లాగా మెరిసిపోతున్నవి. ఆయన్ని చూడగానే ఎంతో కష్టపడి శ్రమకోర్చి. కఠిన తపస్సుచేసి తన ఆశయం నెరవేర్చుకున్నాడు అని ఇట్టే తెలిసి పోతుంది. ఋషభుడు అన్నివిషయాలూ చెప్పి 'మీదయవల్ల మా మహారాజుగారి పట్టుదల ఆశ నెర వేరాలి' అన్నాడు. తనూ మహర్షి మెల్లగానవ్వి 'అలాగే

చూద్దాం. బాగా పొద్దుబోయింది. భోజనంచేసి విశ్రమించండి. తరువాత ఆలోచిద్దాం' అన్నాడు. ఋషభుడు, సుమిత్రుడు ఒకరినొకరు చూచుకున్నారు. మెల్లగా నవ్వుకున్నారు. అందరూ భోజనాలుచేసి విశ్రాంతి తీసుకుంటున్నారు.



ఇంతలో అక్కడికి మరొక మహారాజు ప్రవేశించి ఏకా యెకి తనువు మహర్షి పాదాల దగ్గరపడి బిగ్గరగా ఏడవడం మొదలెట్టాడు. మహర్షి అతన్ని లేవనెత్తి ఓదార్చి 'ఎవరు నీవు? ఎందుకిలా దుఃఖిస్తున్నావు?' అని ప్రశ్నించాడు. ఆ వచ్చిన కొత్తరాజు ఇలా చెప్పాడు.

"మహర్షీ! నా పేరు సువర్ణ కవచుడు. నేను పాటలీ పుత్రం పరిపాలిస్తున్నాను. నాకు లేకలేక ఒక్క మగపిల్ల వాడు కలిగాడు. ఎంతో తపస్సుచేసి, వినబడ్డ వ్రతాలుచేసి, కనబడని దేవతలకి మొక్కి పొందిన సంతానం కావడంచేత నేను ఎంతో ప్రేమగా పెంచుకుంటున్నాను. ఇప్పటికి వారం రోజుల క్రిందట కొంతమంది స్నేహితులతో కలిసి ఆడుకోడా నికి వెళ్ళాడు. అంతే మళ్ళీ వాడిజాడలేదు. సైనికులను పంపి అన్నితావులూ వెదికించాను. దొరకలేదు. నేను స్వయంగా ఇలా బయలుదేరి అరణ్యమంతా గాలించాను. దొరకలేదు. నన్ను కనికరించి ఆ పిల్లవాడు నాకు దక్కేట్టుగా తమరు..." అంటూ మళ్ళీ పెద్దగా ఏడ్చాడు.

మహర్షి అన్నాడు. 'అయ్యో! పాపం, అబ్బాయి వయ స్సెంత ఉంటుంది?'

'ఎంతోనా మహర్షి పదేళ్ళు'

మహర్షి చెబుతున్నాడు. 'సువర్ణకవచా. నిన్ను చూస్తే నాకు జాలికలుగుతున్నది. అంత పెద్ద దేశానికి రాజువు. నీకు ఏ కొరతాలేదు. కాని ఈ క్షణాన దిక్కు-లేని వాడిలాగ దుఃఖి స్తున్నావు. చూచావా కాలం కర్మం అంటే అలా ఉంటుంది. నిన్ను ఒక చిన్నప్రశ్న అడుగుతాను. నీకు పిల్లవాడిమీద ఎంతో ప్రేమఉండి ఉంటుంది. కదూ?'

'అదేంమాట మహర్షీ-కనిపెంచిన తల్లిదండ్రులకు తమ బిడ్డలమీద ప్రేమ ఉండడంలో ఆశ్చర్యమేమున్నది?'

'ప్రేమతోబాటు మమకారం, వాడు పెరిగి పెద్దవాడు కావాలనే ఆశ, వాణ్ణి ఎలాయినా నీ అంతటివాణ్ణి చేయా లనే పట్టుదలా ఇవన్నీ ఉన్నవికదూ' స్వర్ణకవచుడు తటపటా యించాడు. మునీశ్వరుడు మాటల ధోరణిలో ఏం చెప్పబో తున్నాడో, చివరకు తన కోరికను నెరవేరుస్తాడో లేదో అనే భావం కలిసి ఏమీ అంతుపట్టక 'చిత్తం' అని ఊరుకున్నాడు.

మహర్షి ఈసారి గొంతు కొంచెం పెద్దదిచేసి గంభీరంగా అంటున్నాడు.

'చూశావా స్వర్ణకవచా! నీకు తప్పిపోయిన పిల్లవాడి మీద ప్రేమ, మమకారం, ఆశ, అతను దొరికి తీరాలనే పట్టు

దలా ఉన్నవి. ఈ సుమిత్రి ప్రభువుకు ఇంకోరకమైన సమస్య. ఈ మహావీరుడు ఒక బంగారురంగు లేడిని వేటాడుతూ అడివిలోకి వచ్చాట్ట. అది తనకి చిక్కలేదట. దాన్ని చిక్కించుకోవాలని ఆశ, పట్టుదల. దీన్నిబట్టి మనుష్యులందరూ ఏవేవో ఆశలతో, పట్టుదలలతో, ప్రేమలతో మమకారాలతో బ్రతుకుతుంటారు. ఏది నెరవేరకపోయినా నిరాశ, దుఃఖం. అసలు ఈ భావాలను మానవులు వదలిపెడితే ఎలా ఉంటుంది?' అంటూ అందరివేపూ చూశాడు. ఎవరూ మాట్లాడలేదు. 'నేనో చిన్నకథ చెబుతాను వినండి.'

ఒకరాజు దగ్గరకు ఒకరోజు ఒక మునివచ్చి ఓరాజా నేను చాలా కష్టాల్లో ఉన్నాను. ఎంత బిచ్చమెత్తుకున్నా పొట్ట గడవడంలేదు. నేను పెద్దల దయవల్ల కొన్నివిద్యలు నేర్చుకున్నాను. మీరు దయవుంచి నాకేదైనా సాయంచేయండి. దగ్గరఉన్న అరణ్యంలో చిన్న ఆశ్రమం స్థాపించి విద్యార్థులకు చదువుచెబుతూ నా జీవితాన్ని గడుపుతాను అన్నాట్ట. ఆ రాజు చిర్రుబుర్రులాడి ప్రతివాళ్ళకీ ఇదో వేషం. నేను చిల్లిగవ్వ ఇవ్వను అని కసిరికొట్టాడట. నిరాశచెందిన ఆ ముని ఎలాగో తంటాలుపడి తానే స్వయంకృషిచేత ఒక ఆశ్రమాన్ని స్థాపించి తీవ్రమైన తపస్సుచేసి విద్యావ్యాప్తి చేస్తున్నాడట. కొన్నాళ్ళ తరువాత ఆ రాజు తనకేదో కష్టంవచ్చి తాను మొదట సహాయం చేయక వెళ్ళగొట్టిన ఆ మహర్షి దగ్గరకే వచ్చాడట. ఇప్పుడు ఆ మహర్షి ఏంచేయాలి. తనను రాజు

తరిమికొట్టినట్టే రాజునూ తానూ తరిమికొట్టాలా లేక అయ్యో కష్టంలో ఉన్నాడే అని ఆదుకోవాలా- అంటూ పెద్దగా నవ్వి సువర్ణ కవచుని దగ్గరకువచ్చి 'రాజా నీవునన్ను గుర్తించలేదు కదూ. ఎలా గుర్తిస్తావ్. అంతులేని ఐశ్వర్యం, దాసదాసీలు, సుఖజీవనం...ఇన్నిటి మధ్య ఎలా గుర్తిస్తావు. ఒకనాడు నీ దగ్గరకువచ్చి నువ్వు ధనమదంతో కసిరి కొట్టగా నిరాశతో వెళ్లిపోయిన ఆ మునిని నేనే'-అని కూర్చున్నాడు. అక్కడ ఉన్నవారంతా నిశ్చేష్టులయ్యారు. ఎవ్వరికీ నోటమాట రాలేదు. కొద్దిక్షణాలు గడిచాక సువర్ణకవచుడు మహర్షి కాళ్ళమీద పడి. "మహర్షీ నన్ను క్షమించండి. ఒకనాడు నావల్ల పొరపాటే జరిగింది. నా పాపానికి ప్రాయశ్చిత్తంలేదు" అని, 'నాకు సెలవిప్పించండి. ఈ అజ్ఞానిని మీరు నిండుమనస్సుతో క్షమిస్తేచాలు. నాకు ఉపకారం చేసినట్టే' అంటూ వెళ్లిపోతున్నాడు. తనూమహర్షిలేచి సువర్ణకవచుని దగ్గరకువెళ్లి 'పిచ్చివాడా నేను నీమీద కక్ష తీర్చుకుంటానను కోకు. ఈ విషయం నీకు తెలీడంవల్ల నీ మనస్సులో పశ్చాత్తాపం కలిగి ఇకముందు ఎప్పుడూ నిన్ను యాచించడానికి వచ్చిన దిక్కులేని వాళ్ళను, దరిద్రులను నువ్వు దయగా చూడాలని నా ఉద్దేశం. అది నెరవేరింది. పశ్చాత్తాపం వల్ల నువ్విప్పుడు కాల్చిన బంగారంలాగా పరిశుద్ధుడవైనావు. అదే నాకు కావలసింది. ఇకముందు ఆశలనూ, పట్టుదలనూ, మమకారాలనూ అదుపులో పెట్టుకొని ప్రవర్తించు. అదే

నా సలహా” అంటూ తన స్థానానికి వెళ్ళి పద్మాసనంలో కూర్చొని కళ్ళుమూసుకొని కొంతసేపు జపంచేసి కళ్ళు తెరిచి ఒకదిక్కు చూచి పెద్దగా ఏదో మంత్రం చదివాడు. ఆ మంత్రశక్తిచేత ఆకర్షింపబడిన రాజకుమారుడు బిరబిరా అక్కడకు పరుగెత్తుకొంటూ వచ్చాడు. సువర్ణకవచుడు కుమారుని కౌగిలించుకొని ఆనందంతో ఒళ్ళు మరచాడు. ఇద్దరూ మహర్షి పాదాలకు నమస్కరించి సెలవు తీసికొని వెళ్ళిపోయారు.

అక్కడఉన్న ఋషభుడు, సుమిత్రుడూ లేచి తనూ మహర్షి కాళ్ళకి మ్రొక్కి ‘మాకు సెలవా’ అన్నారు.

తనూమహర్షి నవ్వుతూ గడ్డం నిముడుకుంటూ కళ్ళల్లో వెన్నెల కురిపిస్తూ చిలిపిగా ‘మరి ఈ రాజుగారి లేడి సంగతి?’ అన్నాడు. సుమిత్రుడు చేతులు జోడించి ‘ఇద్దరు ఋషులూ నాకు జ్ఞానోదయం కలిగించారు. మీ ఆశీస్సులు చాలు లేళ్ళూవద్దూ దుప్పులూ వద్దు’ అంటూ వెళ్ళిపోయాడు.

(ఈ కథలో విశేషాలు ఇలా వివరించుకోవచ్చు: సుమిత్రుడు అనేరాజు వేట అనే వ్యసనానికి గురైనాడు. రాజులకు వేట ఒక వినోదం. మునుల ఆశ్రమాలను క్రూరమృగాల బారినుండి రక్షించే ఒక కార్యక్రమం. దాంట్లో అతడు హద్దు మీరి తన కర్తవ్యాన్ని వ్యామోహంగా మార్చుకొని బంగారు లేడి విషయంలో చాలా తీవ్రమైన ఆశకు గురైనాడు. ఋషభుడు లౌక్యంగా ఈ విషయాన్ని మరొక ఋషిచేత చెప్పి

చెప్పకుండా చెప్పించాడు. మునీశ్వరులు దయామయులు, కష్టాల్లో ఉన్నవారిని ఆదుకుంటారు. అయితే ఆ కష్టం మామూలు కష్టమైతే లాభంలేదు. బంగారు లేడిని ఆకర్షించి రాజుకివ్వడం ఆ యిద్దరు ఋషుల్లో ఎవరైనా సులభంగా చేయగలరు. కాని ఎందుకు చేయలేదు? అది ఆశకూ వ్యామోహానికీ కేంద్రంగాని పెద్ద విషమసమస్య కాదు. తనూమహర్షి సువర్ణకవచునివల్ల ఒకనాడు అపకారం పొందికూడా అతని పశ్చాత్తాపంవల్ల మనస్సుకరిగి అతనికి మహోపకారం చేశాడు. అంతేకాదు. సువర్ణకవచుడు కుమారుణ్ణి కోల్పోయిన దీనుడు. ఎన్నితప్పులైనా క్షమించి ఇలాంటి తీవ్రమైన కష్టాల్లో ఉన్న వాళ్ళని కాపాడటం చాలా ఉత్తమ ధర్మం. దేవుడు, దేవుని వంటి మహాత్ములు మాత్రమే ఈ పని చేయగలుగుతారు. అందుచేత తనూమహర్షి తన ఉత్తమ గుణాన్ని దైవలక్షణాన్ని నిరూపించుకున్నాడు. మానవులు తమ ఆశలను, ఆశయాలను, పట్టుదలను, కోరికలను అదుపులో పెట్టుకొని దైవాన్ని నమ్ముకొని మంచి పనులు చేస్తూండాలి అన్న విషయంతోబాటు దేవుడు, దైవసమానులైన పెద్దలు మనం కోరిన పిచ్చిపిచ్చి కోరికలను తీర్చరనీ, సబబైన వానిని తీర్చి మనపై దయచూపుతారనీ ఈ కథవల్ల వ్యాసమహర్షి మనకి నిరూపిస్తున్నారు.)

* * *

# చచ్చిబ్రతికిన బాలుడు

విదిశ అనే పట్టణంలో ఒక గృహస్థు ఉన్నాడు. అతడు బాగా డబ్బుకలవాడు. మామూలుగా డబ్బుగలవాళ్ళకి ఉండే దుర్గుణాలు ఏవీ అతనికి లేవు. లేకపోగా చాలా మంచి గుణాలు ఉన్నవి. మొదటిది, తన బంధువులను, స్నేహితులనూ, ఇరుగు పొరుగు వారినీ చాలా ప్రేమగాచూచి ఆదరించేవాడు. రెండోది బీదసాదలకు దాన ధర్మాలుచేస్తూ వాళ్ళని ఎల్లప్పుడూ సంతోషపెట్టాలని ప్రయత్నం చేస్తుండేవాడు. అతని పేరు సుగుణ భూషణుడు. అతని భార్య పేరు సుగుణశీల. వాళ్ళిద్దరూ తమ పేర్లకి తగ్గట్టుగా మంచిగుణాలు కలిగి అందరికీ తల్లోనాలుక లాగా ఉండడంవల్ల ఆ ఊళ్ళో అందరికీ వాళ్ళంటే ఎంతో గౌరవం. ఎంతో ప్రేమ. ఆ దంపతులకి అన్ని ఐశ్వర్యాలు అంత మంచిపేరు ఉన్నా జీవితంలో ఒకేఒక లోపం ఉండేది. చాలాకాలం వాళ్ళకి సంతానం కలగలేదు. ఒక మునీశ్వరుడి సలహావల్ల దంపతులిద్దరూ నిష్ఠతో శివుణ్ణి పూజించారు. వ్రతాలు, జాగరాలు, అభిషేకాలుచేసి భక్తితో కొన్ని సంవత్సరాలు ఇలా శివుణ్ణి పూజించిన మీదట వారికి ఒక పిల్లవాడు పుట్టేడు. దంపతులు శివుని దయవల్ల పుట్టిన ఆ పిల్లవాడికి 'శివప్రసాదు' అని పేరు పెట్టుకొని అల్లారు ముద్దుగా

పెంచుకొన్నారు. ఆ పిల్లవాడుకూడా అందచందాలలో, ఆట పాటలలో, చదువు సాములలో జనముద్దుగా పెరుగుతూ అందరినీ ఆనందపరుస్తున్నాడు. అతనికి అయిదేళ్ళు నిండాయి.

కాని దురదృష్టవశాత్తు శివప్రసాదు కొద్ది రోజులు జ్వరంతో బాధపడి హఠాత్తుగా చచ్చిపోయాడు. సుగుణ దంపతుల దుఃఖానికి అంతులేదు. వాళ్ళ జీవితంలో ఇలాంటి కష్టం వస్తుందని ఎవరూ ఊహించలేదు. బంధువులూ, స్నేహితులూ వందలకొద్దీ గుమికూడి ఆ దంపతులను తగువైన మాటలతో ఓదార్చారు. భగవంతుని దయ తప్పిందని కొందరూ, ఆపిల్లాడి ఆయుస్సు అంతవరకే ఉన్నదని కొందరూ, వాడి కర్మశేషం వాడు తీర్చుకొని మన కడుపులో చిచ్చుపెట్టి వెళ్ళిపోయాడని కొందరూ, పోయిన వారితో పోయి వచ్చేవారితో రాలేమని కొందరూ, మానవుడు అన్నిటినీ జయించాడు కాని చావు పుట్టుకలు జయించలేదు అని కొందరూ, మనస్సు రాయిచేసుకొని బ్రతకక తప్పదని కొందరూ— ఇలా రకరకాలుగా మాట్లాడారు. సాయంత్రం కావస్తున్నది. ఆ దంపతులు నిజంగానే మనస్సు రాయిచేసుకొని శివప్రసాదు శవాన్ని తీసుకొని శ్మశానానికి బయలుదేరి వెళ్ళారు. వాళ్ళని అనుసరించుకొని చాలామంది చుట్టుపక్కలు, స్నేహితులూ వచ్చారు.

విదిశానగర శ్మశానానికి దగ్గరగా చాలా కాలంనుండీ ఒక గద్ద, ఒక గుంటనక్క నివసిస్తున్నవి. ఇంతమంది బయలుదేరి

ఒకబాలుని శవం తీసుకొని రావడం మారంనుండి పసిగట్టిన గద్ద, నక్క రెండూ ఆ రోజు తమపంట పండిందనీ తిండి కోసం వెదుక్కునే శ్రమ తప్పిందనీ హాయిగా ఆహారాన్ని తినేసి ఆకలి తీర్చుకోవచ్చుననీ ఆశపడ్డాయి. ఆ రెండూ ఒక దానికొకటి విరోధులు కాబట్టి ఒకతికి దక్కకుండా రెండోది ఈ ఆహారం దక్కించుకోవాలని ఆలోచించాయి. మొదట గద్ద వచ్చి తల్లి దండ్రులనుద్దేశించి ఇలా చెప్పింది. "అయ్యో పాపం! మీరా నేను ఎవరో అనుకున్నాను. ఈ విదిశా నగరంలోనేకాదు. భారతదేశం మొత్తంమీద మీ పేరు విననివాళ్ళు, మీ దాన ధర్మాలను తెలీనివాళ్ళూ లేరు. అంతటి ఉత్తములు మీకు ఇలాంటి కష్టం వచ్చిందంటే నాకే దుఃఖం ఆగడంలేదు. కాని ఏంచేస్తాం చెప్పండి. విధి ఎవ్వరికీ తప్పదు. ఇప్పుడు మీరు చేయవలసిన కర్తవ్యం ఆలోచించాలి గాని ఊరికే దుఃఖిస్తుంటే లాభంలేదు. సూర్యాస్తమయం కాకముందే శవాన్ని పూడ్చిపెట్టి వెళ్ళిపోండి. అది శాస్త్రపద్ధతి" అని చెప్పి సానుభూతి సూచకంగా ఒక నిముషం మౌనం పాటించి, కళ్ళనీళ్ళుకార్చి వెళ్ళిపోయింది. గద్ద ఉద్దేశం ఏమిటంటే వాళ్ళు శవాన్ని పాతిపెట్టి వెళ్ళిపోగానే దాన్ని తవ్వుకొని తినవచ్చు అని. చీకటి పడితే దానికి కళ్ళు కనిపించవు కనుక చీకటి పడేలోగా వాళ్ళు వెళ్ళిపోతే కడుపునిండా తిండి తినవచ్చని దాని ఆశ. ఆ గద్ద అలా రెక్కలు కదలించి వెళ్ళిందో లేదో నక్క తయారైంది. గద్దకంటే

ఎక్కువ నైపుణ్యంతో సానుభూతిని చూపిస్తూ ఇలా ఉపన్యాసం చేసింది. "ఇప్పుడా పాపిష్టి గద్దవచ్చి చెప్పిన మాటలన్నీ విన్నాను. ఎందుకు విన్నానా అని ఆశ్చర్య పడుతున్నారుకదూ. మీరు నన్నెరుగరుగాని నేను మిమ్మల్ని బాగా ఎరుగుదును. నాకు ఏదో శాపంవల్ల ఈ నక్కజన్మ కలిగిందిగాని నాకూ మీకు మల్లేనే శివభక్తి ఎక్కువ, మీరు కొండమీద శివాలయానికి వచ్చి అభిషేకాలూ అవీ చేస్తుంటే నేను దూరంనుండి గమనిస్తూ నిలబడి ఉండేవాడిని. ఈ దంపతులకి తప్పక మేలుచెయ్యి స్వామీ అని మీతో పాటు శివుణ్ణి ప్రార్థిస్తుండే వాడిని. దాంతో పాటు నాకు వీలైనంత త్వరలో చావు వచ్చేట్టుచేసి ఈ సారి నక్కజన్మ రాకుండా కనీసం సుగుణ దంపతుల ఇంటికుక్కగానైనా పుట్టించు స్వామీ అని ప్రార్థించాను. అందుచేత మీ మంచికోసం మీ మేలుకోరి ఒక్కనలహా యిస్తున్నాను. గద్ద ఉపాయం మీకు అర్థమయ్యే ఉంటుంది. మీరు శివప్రసాదుని పాతిపెట్టి వెళ్ళగానే తాను తినవచ్చునని దాని ఉద్దేశం. అలా జరగడానికి వీల్లేదు. శివప్రసాదు శివుని వరంవలన పుట్టినవాడు. వాడికి చావు లేదు. ఒకవేళ కర్మవశాన వాడు చచ్చిపోయినా అయ్యో తన వరప్రసాదం మరణించాడే, ఏదో పొరపాటు జరిగి ఉంటుంది అని తన తప్పు తెలుసుకున్న శివుడు గంగా పార్వతులతో సహా బయలుదేరివచ్చి మళ్ళీ ప్రాణంపోసి బతికిస్తాడు చూస్తుండండి. గట్టిగా ప్రార్థించండి. అంతేగాని పాపిష్టి గద్ద మాటలు

నమ్ముకొని ముక్కుపచ్చలారని పసివాణ్ణి వదలిపెట్టి వెళ్ళి
పోతారా." ఇంతసేపు మంచి మాటలతో తల్లిదండ్రులకు
నిజంగా ఆశపుట్టే పద్ధతిలో నక్క మాట్లాడడం వినడానికి
సొంపుగా ఉన్నా అసలు రహస్యం వేరేఉన్నది. నక్క
రాత్రిళ్లు బాగా తిరిగి ఆహారాన్ని సంపాదించుకొని తింటుంది.
ప్రస్తుతం కొంత కాలక్షేపంచేసి గద్ద ప్రమాదం తప్పించుకుంటే
చాలు. రాత్రిళ్ళు గద్ద ఎలాగూ బయటకు రాలేదు. తల్లి
దండ్రిలూ, బంధువులూ, ఏ శివుణ్ణో కొంతసేపు ప్రార్థించి
విసిగిపోయి వాళ్లదోవన వాళ్లు వెళ్లిపోతారు. అప్పుడు తాను
హాయిగా శవాన్ని తినవచ్చు. భక్తి, సానుభూతి ఇవన్నీ నక్క
జిత్తులు. ఇలాచెప్పి కాస్సేపు తానుగూడా మౌనం పాటించి
కన్నీళ్ళుకార్చి నక్క వెళ్లిపోయింది.

నక్క అలా వెళ్లిందో లేదో గద్ద వచ్చింది. 'నాకు
తెలుసు. మీరు ఆ నక్క మాటలు చెవులు రిక్కించుకొని
మరీ విన్నారు. దానికసలు బుద్ధిలేదు. ఎక్కడైనా చచ్చి
పోయినవాళ్ళు మళ్లీ బ్రతకడం కద్దా. దాని మాటలు విన
కుండా తక్షణం ఆ శవాన్ని అక్కడ పడవేసి వెళ్లండి. పొద్దు
క్రుంకితే శ్మశానానికి భూత ప్రేత పిశాచ రాక్షస గణాలు
వస్తవి. అవి మిమ్మల్నికూడా తింటాయి. తరువాత మీ
యిష్టం' అని గట్టిగా హెచ్చరించి వెళ్లిపోయింది. సుగుణ
దంపతులూ, బంధుమిత్రులూ శవాన్ని అక్కడ పాతిపెట్టి
వెళ్లిపోదామని అనుకుంటున్నంతలో మళ్లీ గుంటలోనుండి

నక్కవచ్చి చెప్పింది. 'చూచారా దాని పొగరు. ఒక వేపున భగవంతుని భక్తుణ్ణయిన నేను మీ పిల్లవాడు బ్రతికే ఉపాయంచెప్పి మిమ్మల్ని యీ ప్రమాదనుండి కాపాడాలని ప్రయత్నం చేస్తుంటే మిమ్మల్ని భయపెట్టి ఇక్కణ్ణుంచి ఎలాయినా వెళ్లగొట్టాలని చూస్తున్నది. దాని స్వార్థం మీరు గమనించండి. అదే పదివేలు. భక్తపరాధీనుడు, కరుణా సముద్రుడు అయిన శివుడు పిలిస్తే పలికే ప్రత్యక్ష దైవం. ఆనాడు మార్కండేయుణ్ణి బ్రతికించి యముణ్ణి పళ్లూడ గొట్ట లేదా. అలాగే ఈనాడూను. మీరేం భయపడకండి, పిల్లాడు ఎలా బ్రతకడో నేను చూస్తాను. గట్టిగా జపం చెయ్యండి' అని చెప్పి వెళ్లింది.

మళ్లీ గద్దవచ్చి 'అనవసరంగా ఆలస్యం చేయకండి. ఇంటికివెళ్లి బాలుని పేర దానధర్మాలు చేయండి. వాడికి స్వర్గం ప్రాప్తిస్తుంది.నా ఇన్నేళ్ల అనుభవంలో చచ్చినవాళ్లు బ్రతకడం కనీవినీ ఎరుగను. ఇలా ఇంకాసేపున్నారంటే వాడు బ్రతకడం అలాఉంచి పిశాచాల చేతులో మీరు చావడంతప్పదు' అని చెప్పింది.

మళ్లీ నక్కవచ్చి 'గద్దమాటలు విని మోసపోకండి. దానికి తెలీనంత మాత్రాన ఎక్కడా ఏమీ జరగనట్టేనా. శ్రీరామ చంద్రుడు ఒక బ్రాహ్మణ బాలుణ్ణి బ్రతికించాడు.

నారదమహర్షి సృంజయుని కొడుకును బ్రతికించాడు. అందాకా ఎందుకు మొన్నమొన్న ఒక సిద్ధుడు నా కళ్ళముందరే ఓ పిల్లాడికి ప్రాణదానం చేశాడు. అలాగే ఏ 'సిద్ధుడో, సాధ్యుడో, దేవుడో, దయ్యమో మీ మీద దయచూప వచ్చు' అన్నది. ఇలా పిల్లవాణ్ణి వదలిపెట్టి తక్షణం వెళ్లి పోండి మీరైనా బ్రతికి బట్టకడతారు అని గద్ద, ఎక్కడికీ వెళ్ళకండి దేవుని దయవల్ల పిల్లవాడు బ్రతుకుతాడు అని నక్క, చెవినిల్లు కట్టుకొని పోరుతుంటే ఆహోరు వినలేక సుగుణ దంపతులకీ, కూడావచ్చిన వాళ్లకీ చెవులు దిబ్బెళ్ళు వేశాయి. ఇంతలో సూర్యాస్తమయమై నాలుగు దిక్కులనుండీ చీకట్లు కమ్ముతున్నాయి. అక్కడ చేరిన జనం యావత్తు తిరిగి వెళ్లిపోయే ప్రయత్నంలో ఉన్నారు. కూడావచ్చిన సేవకుడు భూమి త్రవ్వి గుంటచేస్తున్నాడు. తల్లిదండ్రిలూ, చుట్ట పక్కాలు చివరిసారి పిల్లవాణ్ణిచూచి దిక్కులు బద్దలయ్యేలాగా పెద్దపెద్దగా ఏడుస్తున్నారు.

ఇంతలో అందరి కన్నులూ మిరిమిట్లు కొలుపుతూ ఆకాశంనుండి ఒక వెలుగుముద్ద నేలమీదికి దిగింది. అందరూ కళ్ళు నులుముకొని చూచారు. శివుడు ప్రత్యక్షమయ్యాడు. నెత్తిన నెలవంక, జడల్లో గంగానది, మూడుకన్నులు, అలంకారాలుగా వేసుకొన్న పాములు, సగంశరీరంగా పార్వతీ దేవి, వాహనంగా నందీశ్వరుడు, చేతులో త్రిశూలము- ఇలా దర్శనమిచ్చిన శివుణ్ణి అక్కడ ఉన్నవారంతా దర్శనంచేసుకొని

ఒళ్ళు మఱచి ప్రార్థనలు చేశారు. ఆయనకు దయకలిగి సుగుణ దంపతులను చూచి 'మీ భక్తికి మెచ్చుకున్నాను. మీకేమైనా వరం కావాలంటే అడగండి. ఇస్తాను' అన్నాడు. సుగుణ దంపతులు చేతులు జోడించి 'మా ఏకైక పుత్రుడు అయిదేళ్ల వయస్సులోనే చచ్చిపోయాడు. వాణ్ణి బ్రతికించండి' అని ప్రార్థించారు.

శివుడు 'తథాస్తు' అన్నాడు. పిల్లవాడు నిద్రలోనుంచి లేచినట్టు లేచి తానుకూడా శివునికి నమస్కరించి ప్రార్థించాడు. శివుడు అంతర్ధానమైనాడు. అందరూ సంతోషంతో ఇంటి ముఖం పట్టారు. అల్లంత దూరాన ఆకాశంలో గద్ద, గుంటలో నక్క నిరాశ చేసుకొని కిక్కురు మనకుండా ఉండిపోయాయి.

(ఈ కథలో నక్క, గద్ద మనకు ప్రపంచంలో ఎప్పుడూ కనుపించే స్వార్థపరులు. వాళ్ళకి ఎదుటివాళ్ల కష్టసుఖాలతో నిమిత్తంలేదు. తమ అవసరాలు తీరడం తప్ప వాళ్లకేమీ అక్కరలేదు. అందుకోసం వాళ్ళు అబద్ధాలు చెబుతారు. దైవభక్తి ఉన్నట్టు నటిస్తారు. ఎదుటివాళ్లని గోతిలో దించడానికి ఎంత ద్రోహమైనా చేస్తారు. ఇలాంటి వాళ్లని ఓకంట కనిపెట్టి ఉండి మనం జాగ్రత్త పడాలి—— అన్నది ఈ కథవల్ల మనం నేర్చుకోవాలి. సుగుణ దంపతులు మనోవాక్కాయ

కర్మలతో భగవంతుణ్ణే నమ్ముకున్నారు కాబట్టి ఆ దుర్మార్గుల బారినుండి దేవుడే వాళ్లని రక్షించాడు. మామూలు మనుషులు కూడా మంచిపనులు చేస్తూ ఇతరులకు ఉపకారంచేసే పద్ధతిలో జీవిస్తూఉంటే వాళ్లకికూడా ఏదో రూపంలో దేవుని దయ లభిస్తుంది. అప్పుడు వాళ్ళు పైన చెప్పిన దుర్మార్గుల చేతులో పడకుండా తప్పించుకోగలుగుతారు. కాబట్టి ఆత్మవిశ్వాసము, దైవభక్తి, పరోపకారము, మంచి ప్రవర్తన మొదలైన గుణాలు మానవులను ఎల్లప్పుడూ కాపాడగలవు— అన్న రహస్యాన్ని ఈ చిన్నకథ ద్వారా వ్యాసమహర్షి మనకి ప్రసాదించారు.)



# కృతఘ్నుని శవాన్ని కుక్కలుకూడా ముట్టుకోవు!

కళింగ దేశంలో వేదం బాగా చదువుకున్న ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఆయన పేరు వేదమూర్తి. ఆయన భార్య పేరు సరస్వతి. ఆ దంపతులకు ఒకేఒక కుమారుడు. లేక లేక కలిగిన బిడ్డడు కావడంవల్ల తల్లిదండ్రులు ఆ పిల్లవాణ్ణి చాలా గారాబంగా పెంచారు. అతని పేరు గౌతముడు. ఆ పిల్లవాణ్ణికూడా తనంతటి పండితుణ్ణి చేయాలని, వృద్ధిలోకి తీసుకు రావాలని వేదమూర్తి ఆశయం. అందుచేతనే అతనికి చాలా చిన్నతనంలోనే ఉపనయనంచేసి తగిన గురువులవద్ద విద్యాభ్యాసానికి పంపాడు. కాని దురదృష్టవశాత్తు గౌతమునికి చదువు అబ్బలేదు. పైపెచ్చు చెడుసావాసాలుచేసి చాలా చిన్నతనంలోనే చెడుఅలవాట్లునేర్చుకొని దుర్మార్గుడయ్యాడు. తల్లిదండ్రులు తాము మందలించారు. పెద్దలైన గురువుల చేత చెప్పించారు. కాని లాభంలేక పోయింది. గౌతముడికి యుక్తవయస్సు వచ్చేసరికి దిగులుతో క్రుంగి కృశించిన తల్లిదండ్రులిద్దరూ మరణించారు. గౌతమునికి ఆ కాస్త అడ్డూ తొలిగిపోయింది. ఇంక అతని దుర్మార్గాలకు అడ్డమూ ఆక లేకుండా పోయింది. త్రాగుడు, జూదము, వ్యభిచారము,

దొంగతనము ఒకటేమిటి ప్రపంచంలో ఎన్ని దుర్గుణా లున్నయ్యో అన్నీ నేర్చుకొని క్రమంగా పతనమై ఇల్లూ ఒళ్లూ గుల్ల చేసుకొని ఆ ఊళ్లో నివసించడానికి వీల్లేని పరిస్థితుల్లో ఊరు వదలిపెట్టి అడవుల పాలయ్యాడు.

అడవిలో ప్రయాణం చేస్తుండగా అతనికి ఒక బోయ పల్లె కనుపించింది. ఆ పల్లె నాయకుని దగ్గరకుపోయి తన సంగ తంతా చెప్పుకొని తనకి ఆశ్రయమిచ్చి కాపాడవలసిందిగా ప్రార్థించాడు. 'నాకు భోగభాగ్యాలు అక్కరలేదు. పొట్ట గడిస్తేచాలు. మీతోనే ఉంటాను. మీరుచెప్పిన పనులు చేస్తుంటాను. నన్ను మీలో ఒకడిగా భావించి రక్షించండి' అంటూ కాళ్లావేళ్లా పడ్డాడు. మనసు కరిగిన బోయలు అతనికి ఆశ్రయమిచ్చారు. బోయపల్లెలో పెద్దదొర అడిగాడు. 'తమరుచూస్తే బాగా చదువుకున్న బాపనవారిలా ఉన్నారు. మాలాంటి వాళ్ళలో ఎలా బ్రతుకుతారు?' అని. 'చెడిపోయి ఆకలితో బాధపడడానికి బాపనాడైతేనేం, మరొకడైతేనేం పైగా నాకు అలాంటి భేదాలులేవు. మీతో ఉంటాను. మీరు పెట్టింది తింటాను. మీరు దయదలిస్తే మీపల్లెలోనే ఓ యింటి వాణ్ణవుతాను' అని సమాధానం చెప్పాడు. పల్లెదొర జాలిపడి గౌతమునికి ఒక గుడిసె వేయించి, తన కూతురునిచ్చి పెళ్ళిచేసి ఆదరించాడు. గౌతముడు వాళ్ళతో బాటు వేట, మాంసం తినడం, మొదలైనవన్నీ అలవాటు చేసుకొని వాళ్లల్లో కలిసి పోయాడు.

కాలం గడుస్తున్నది. ఇప్పుడు అతనికి ఆకలి తిప్పలూ కామవాంఛ తీరుతున్నవి. ఆటవికుల మధ్య తానూ ఒక ఆటవికుడై అచ్చం బోయవాడిలాగ వాళ్ల ఆటపాటల్లో పాలు పంచుకుంటూ హాయిగా కాలక్షేపం చేస్తున్నాడు. కాని మనస్సులో గౌతముడికి ఏదో కొరతగా ఉన్నది. ఒకరోజు వంటరిగా కూర్చుని తన బ్రతుకును తాను ఒకసారి ముందు వెనుకలు చూచుకుంటే దుఃఖం ముంచుకొచ్చింది. వలవలా ఏడ్చాడు—తల్లిదండ్రులు ప్రేమతో పెంచి చదువు చెప్పించాలని ప్రయత్నం చేశారు. వాళ్లకి ఎదురుతిరిగి, గురువులు చెప్పిన విద్యాబుద్ధులు నేర్చుకోక ఎందుకూ పనికి రాకుండా పోయాను. ఇప్పుడేమనుకుంటే ఏం లాభం. మనిషి తన జీవితంలో జరిగిపోయిన విషయాలనుగూర్చి బాధపడి కాలం వృధా చేయకూడదు. జరుగవలసిందేదో ఆలోచించాలి. ఇప్పుడు నేను మళ్ళీ కళింగ దేశానికివెళ్లి భలానావారి అబ్బాయిని అని చెప్పుకొని కొత్తజీవితం ప్రారంభించడం సాధ్యం కాదు. అందరూ నవ్వుతారు. నాకు తల కొట్టేసినట్టుగా ఉంటుంది. ఇక ఇక్కడే ఎల్లకాలమూ ఉండిపోదామా అంటే ఇది ఎదుగూ బొదుగూలేని బ్రతుకు. ఈ బోయలమధ్య వాళ్లుపెట్టింది తింటూ, యీ బోయదానితో సంసారంచేసి పిల్లల్నికని నా బ్రతుకు బండలు చేసుకోవడంతప్ప ఇంకేమీ సాధించలేను. వేదవిద్యకీ, విజ్ఞానానికీ, వంశ గౌరవానికీ ఎలాగూ దూరమయ్యాను. ఇకనాకు ఏమి మిగిలింది?—

ఇలా ఆలోచించిన గౌతమునికి మనస్సులో మెఱుపు తీగలాగ ఒక ఆలోచన వచ్చింది. ఎలాయినా సరే. నేను బోలెడంత డబ్బు సంపాదించి ఈ దేశంలో నాఅంత ధనికుడు లేడు అనే పేరు తెచ్చుకోవాలి. డబ్బున్న వాళ్ళనిచూస్తే అందరూ భయపడతారు. వాళ్లుడబ్బుతో దేన్నయినా కొనుక్కోగలరు. ఇళ్లు, వాకిళ్లు, భవనాలు, స్త్రీలు, దాసదాసీలు— ఏ భోగం కావాలంటే ఆ భోగం డబ్బున్నవాడి కాళ్ళదగ్గరకు వస్తుంది. జీవితం హాయిగా వెళ్ళిపోతుంది. అప్పుడు నువ్వు ఉత్తమ వంశంలో పుట్టావా లేదా బాగా చదువుకున్నావా లేదా మొదలైన ప్రశ్నలు పుట్టవు. డబ్బుకులోకం దాసోహం. డబ్బు సంపాదించడానికి ఎన్ని తప్పుడుపనులు చేసినా తప్పు లేదు— ఇలాంటి నిర్ణయం చేసిన గౌతముని మనస్సులో ఇంతకు ముందున్న పిశాచాలుకాక ఇప్పుడు కొత్తపిశాచం డబ్బాశ వచ్చిచేరింది. ఇంకేం, డబ్బు సంపాదించడం ఎలాగ? అనే సమస్యతో గౌతముడు సతమతమవుతున్నాడు. అరణ్య మధ్యాన, బోయవాళ్ళ నీడన ఉంటూ డబ్బుసంపాదించడం ఎలా సాధ్యం?

ఇలాంటి ఆలోచనలతో సతమతమవుతూ ఓ నాడు అడవి మధ్యభాగంలో గౌతముడు వేటకు వెళ్ళాడు. వేటాడు తుండగా దూరాన ఒక బిడారు కనుపించింది. (బిడారు అంటే వర్తకుల సమూహం. పూర్వకాలంలో వర్తకులు సమూహాలుగా ఏర్పడి ఒకచోట నుండి మరొక చోటికి సరుకులను

తీసుకొని ప్రయాణం చేసేవారు. ఆ రోజుల్లో సౌకర్యాలు తక్కువ కాబట్టి గుర్రాలమీద, ఒంటెలమీద, బళ్ళమీద సామాన్లు వేసుకొని కాపలావాళ్ళ సహాయంతో ప్రయాణాలు చేస్తూ రాత్రుళ్ళు డేరాలు వేసుకొని విశ్రాంతి తీసుకుంటూ పగలు ప్రయాణంచేస్తూ తమ వ్యాపారం చూచుకునేవారు. ఇలాంటి దాన్ని బిడారు, సాతు, చనుప, సార్ధ వాహము మొదలైన పేర్లతో పిలుస్తారు.) బిడారును చూడగానే గౌతమునికి ఒక ఆలోచన వచ్చింది. డబ్బు సంపాదించడానికి వ్యాపారం అన్నిటిలోకీ సులభమైన మార్గం. ఈ వర్తకులతో నేనుగూడా కలిసి వ్యాపారంచేస్తే ఎలా ఉంటుంది? ఈ ఆలోచన వచ్చిందో లేదో బిరబిరా బయలుదేరి బిడారుదగ్గరకు వెళ్లాడు. వర్తకులందరూ గౌతముడు తమవైపు రావడం చూచి భయపడ్డారు. రోజూ వేటాడ్డంచేత గౌతముని ఒళ్లంతా కండలుతిరిగి నిగనిగ లాడుతున్నది. బోయలలో జీవిస్తూ వాళ్ల ఆచార వ్యవహారాలు, హింస, క్రూరమృగాల మధ్య నివాసము మొదలైన విషయాలు అలవాటు చేసుకున్న అతని ముఖంలో క్రౌర్యం కొట్టవచ్చినట్టు కనుపిస్తున్నది. చేతులో భయంకరమైన విల్లంబులు ధరించి వచ్చిన గౌతముని దగ్గరకు వచ్చి ఆ వర్తకులలో పెద్ద చేతులు జోడించి ఇలా అన్నాడు. 'అయ్యా బోయరాజా! మా జోలికి రాకు. సరుకులమ్ముకుని బ్రతికేవాళ్లం. మమ్మల్ని చంపితే నీకేం వస్తుంది. మా దగ్గర ఉన్న సరుకులలో నీకు కావలసినవి పట్టుకెళ్ళు. మా మనవి

ఆలకించు.' ఈ మాటలు విన్న గౌతమునికి లోలోపల నవ్వు వచ్చింది. నన్ను చూచి వీళ్ళు భయపడ్డారు. వీళ్ళు చాలా పిరికివాళ్లన్నమాట. వీళ్లని సులభంగా మోసం చేయవచ్చు అనుకున్నాడు. అతనిలో ధర్మం, న్యాయం, మొదలైన మంచి ఆలోచనలు ఎప్పుడో నశించిపోయాయి. ఇప్పుడు డబ్బు సంపాదించడం అనే ఆశయం తప్ప ఆనీచుడి మనస్సులో ఇంకేం మిగల్లేదు. ఒక దురాలోచన చేశాడు. బిడారు వర్తకులకు మంచి మాటలు చెప్పి వాళ్లని నమ్మించి వాళ్ల వెంబడి పోయి రాత్రికి రాత్రికి వాళ్ళందరినీ చంపి సరుకులతో, డబ్బుతో పారిపోదామని నిశ్చయించుకున్నాడు. మనస్సులో ఇలా ఆలోచన చేసుకొని లేనినవ్వు తెచ్చిపెట్టుకొని, 'షావుకారు గారూ. మీరు భయపడకండి. నేను మిమ్మల్ని చంపడానికి రాలేదు. మీకు సహాయం చేయడానికి వచ్చాను. ఈ అడవిలో క్రూరమృగాల బాధ ఎక్కువగా ఉన్నది. నేను మీ వెంటఉండి మిమ్మల్ని కాపాడి అడవి దాటిస్తాను. అందుకు ప్రతిఫలంగా మీరు నాకో సాయం చేయాలి. నేను బ్రతికి చెడ్డవాణ్ణి. ప్రస్తుతం చాలా ఇబ్బందులు పడుతున్నాను. నన్నుకూడా మీ బిడారులో చేర్చుకోండి. మిమ్మల్ని కనిపెట్టుకొని ఉంటాను. మీ దయవల్ల నాపొట్ట గడిస్తేచాలు. ఈ ఒక్కసాయం చేయండి. మీ ఋణం తీర్చుకుంటాను' అన్నాడు. ఈ మాటలువిన్న వర్తకులకు జాలికలిగి 'అలాగే'

అన్నారు. విల్లంబులు ధరించి బిడారుముందు భాగాన కాపలా కాస్తూ గౌతముడు బయలుదేరాడు. ఆనాటి రాత్రి అరణ్యం మధ్య భాగంలో డేరాలు వేసుకొని, కాగడాలు వెలిగించి వర్తకులందరూ వంటలు చేస్తున్నారు. భోజనాలు పూర్తిచేసి ఒళ్ళుమఱచి నిద్రించే సమయంలో తనపని పూర్తిచేద్దామని నిర్ణయించుకున్నాడు గౌతముడు. ఇంతలో ఎక్కడనుండో ఊడిపడ్డట్టు ఒక పెద్ద ఏనుగులగుంపు భయంకరంగా ఘీంకారాలు చేస్తూ బిడారుమీద వచ్చిపడ్డది. డేరాలను, మనుషులను, వస్తువులను మట్టగించి చెల్లా చెదరుచేసి నానా భీభత్సంచేసింది. చెట్టుకొకరు పుట్టకొకరు ఎంతట పడ్డవారు అంతట ప్రాణ భీతితో అన్నిదిక్కులకూ పరుగెత్తారు. అంతా అయోమయం. అంధకారం. భీభత్సం...



ఆ భీభత్సంలో ఉత్తరదిక్కున పారిపోయిన గౌతముడు చాలా దూరంవెళ్ళి అలసిపోయి ఓ పెద్ద మఱ్ఱిచెట్టు నీడన నిద్రపోయాడు. తెల తెల వారుతుండగా మెలకువ వచ్చింది. ఆ మఱ్ఱిచెట్టు చాలా పెద్దది. అన్ని వైపులకూ కొమ్మలతో వ్యాపించి నేలలో ఊడలుబారి ఆదొక విశాలమైన భవనం లాగా ఉన్నది. పక్షుల కిలకిల ధ్వనులు, సూర్యకిరణాల గోరువెచ్చని స్పర్శ తగిలి గౌతముడు మేలుకొన్నాడు. రాత్రి జరిగిన అనుభవమంతా అతనికి ఒక కలలాగ తోచింది. తాను

అనుకున్న దేమిటి? జరిగిందేమిటి? వాళ్ళ ప్రాణాలుతీసి డబ్బు కాజేసి గొప్ప ధనవంతుడు కావాలనుకున్న అతని ఆశలన్నీ అడియాసలైనాయి. వ్యాపారంచేసి డబ్బు సంపాదించాలని బయలుదేరిన వర్తకులందరూ చెల్లాచెదరై పోయారు. అందులో కొంతమంది చచ్చిపోయి ఉండవచ్చుకూడా. ఇదే కాబోలు తానొకటి తలిస్తే దైవమొకటి తలుస్తాడంటారు- ఇలా ఆలోచించాడే కాని తన మనస్సులో పాపం తనను కట్టి కుడిపిందనీ, ఏ దేవుడో దయచూడ్డంవల్ల తాను బ్రతకగలిగాడనీ ఆ దురాత్ముడికి తోచలేదు. ఇలాంటి ఆలోచనలలో తేలి పోతున్న గౌతమునికి 'బ్రాహ్మణోత్తమా! నమస్కారం' అన్నమాటలు వీనుల విందుగా అమృతంలాగా వినిపించాయి. తలెత్తి చూచాడు. ఆశ్చర్యం! తనముందు ఒక పెద్ద కొంగ నిలబడి ఉన్నది. కొంగంటే అది మామూలు కొంగకాదు. శరీరమంతా పాలవన్నె తెలుపు. పెద్దముక్కు. మెళ్ళో బంగారు హారాలు. మొగాన దమ్మిడీఅంత కుంకుమబొట్టు. ప్రేమగా జాలిగా తనవేపే చూస్తున్న వెన్నెలగనుల లాంటి కళ్లు. గౌతముడు ఒక్కసారి కళ్ళు నులుముకొని చూచాడు. ఇది నిజమా! కలా! ఏ రాక్షసుడైనా తనను స్వాహా చేయడానికి ఈ రూపంలో వచ్చాడా, లేకపోతే నేను బ్రాహ్మణ్ణని దీనికెలా తెలుసు? ఏమీ తోచక గాబరా పడుతున్న గౌతమునితో వీణవాయిస్తున్నంత తియ్యగా ఇలా చెప్పింది కొంగ.

'మహాత్మా! నేను మామూలు కొంగనుగాను. బ్రహ్మ దేవునికి నేనంటే చాలాయిష్టం. నన్ను చిన్నప్పటినుండీ పెంచి నాకు నాడీ జంఘుడనీ, రాజ ధర్ముడనీ పేరుపెట్టి చాలా ప్రేమగా చూచాడు. నేను ఈ మర్రిచెట్టునూ, ఆ సరస్సునూ ఆశ్రయించుకొని బ్రతుకుతున్నాను. మీవంటి పెద్దలను చూస్తే నాకు చాలా గౌరవం. మీరు నా యింటికి వచ్చిన అతిథులన్నమాట' అన్నది.

నాడీ జంఘుని మాటతీరు, మర్యాదచూచి ఆశ్చర్య పడ్డాడు గౌతముడు. ఇదేదో మాయలాడిలాగా ఉన్నది. లేకపోతే బ్రహ్మదేవుడు పెంచిన కొంగ ఏమిటి! ఇందులో ఏదైనా మోసం ఉన్నదా! ఏదైతే మనకేం. ఇప్పుడు మనం చేయగలిగిందిలేదు. అని మనస్సులో ఆలోచించుకొని

'అయ్యా నా పేరు గౌతముడు. కళింగ దేశంలోని ఒక ఉత్తమ బ్రాహ్మణ కుటుంబంలో పుట్టి చదువు అబ్బక.....' అంటూ మొదలుపెట్టి తన కథంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. బిడారువెంట పోవడంలో తనకున్న దుర్మార్గపు టాలోచనతప్ప తక్కిన విషయాలన్నీ దాచకుండా చెప్పేశాడు. 'ఇన్ని తిప్పలుపడి తిరుగుతున్న నన్ను నువ్వు రక్షించాలి. నాకు ఈ క్షణాన ఉన్న సమస్య ఆకలి...నన్నుపట్టి పీడిస్తున్న సమస్య దారిద్ర్యం' అంటూ ముగించాడు.

'అయ్యోపాపం. ఒక్కక్షణం ఉండండి. మీకు ఆహారం తెస్తాను' అంటూ అవతలకు వెళ్లిన కొంగ కొంతసేపటికి

మందాకినీ నదిలోని మంచిరకపు చేపలను వండి ఒక పళ్లెం లోను, మంచిమంచి పళ్లు ఒక పళ్లెంలోను ఉంచుకొని, పళ్ళ రసాలు ఒక పాత్రిలోను, కొలనునీళ్ళు ఒక పాత్రిలోను తెచ్చి యిచ్చి 'హాయిగా ఆకలి తీర్చుకోండి. తరువాత అన్ని విషయాలు మాట్లాడుదాం' అని గౌతముని ముందుంచింది. అతడు బిత్రుగా భోంచేసి గర్రున త్రేన్చేలోపున చిగుళ్ళతో, పూలతో మఱ్ఱిచెట్టు నీడన చక్కని పక్క ఏర్పాటు చేసింది. హాయిగా పడుకున్న గౌతముని ప్రక్కన తాను కూర్చొని రకరకాల తియ్యని కబుర్లతో కాలక్షేపం చేస్తున్నది.

'అమ్మగారు చాలా చిన్నతనంలోనే పోయారన్న మాట'

'చిన్నతనమేం ఖర్మ. అప్పటికి నాకు పదహారోఏడు'

'మరి నాన్నగారు?'

'ఓ ఏడాది తరువాత ఆయనా పోయాడు. బహుశా నా దిగులుతోనే కావచ్చు'

'అయ్యో పాపం. పోన్లెండి పోయినవాళ్లు తిరిగివస్తారా! వేదంలో ఎన్ని పన్నాలు చదువుకున్నారు?'

'నేనా మా నాన్నగారా'

'ఇద్దరూను'

'నాన్నగారు వేదంలో ఎన్నిఉన్నావో అన్నీ చదువు కున్నారు. నాకుమాత్రం సున్నా'

'అయ్యోపాపం. పోనీండి. ఇప్పుడేమనుకుంటే ఏం జరుగుతుంది. అమ్మగారు మీకు మల్లేనే ఉండేవారా?'

'ఆ నేను ఆమెపోలికే అంటారు'

'అన్నట్టు అడగడం మరచాను. బోయదాన్ని పెళ్లాడారే. ప్రేమించి పెళ్ళాడారా?'

'ప్రేమా లేదూ. నా శ్రార్ధం లేదు. దొరికింది దొరికించు కున్నాను'

'అందంగా ఉంటుందా'

'ఆ నల్లరూపున మిసమిస లాడుతూ పిటపిటలాడే వయసుతో... నన్నుబాగా సుఖపెట్టింది'

'అలాంటిదాన్ని ఎందుకు వదిలారు?'

'ఏం చేయను. అడివిబ్రతుకు, అడివిమనుషులు. విసుగు పుట్టి ఎక్కడైనా ఇంత డబ్బు సంపాదించుకుందామని బయలు దేరాను. నా కర్మ ఇలాకాలింది'

"మీ కర్మ ఏం కాలలేదు. వాళ్ళకర్మ కాలింది. మీకు నిద్దరొస్తున్నట్టుంది. కాసేపు విశ్రాంతి తీసుకోండి. తరువాత మాట్లాడుకుందాం"

గౌతముడికి కునుకుపట్టింది. ఆమగత నిద్దురలో ముఖాన విభూతి పెట్టుకొని సంధ్యా వందనం చేసుకుంటున్న నాన్న కనుపించి 'దుర్మార్గుడా! నా కడుపున చెడబుట్టావు' అన్నట్టు అమ్మ కనుపించి 'వేళకింత అన్నం తిని ఇంటిపట్టున ఉండరా, చదువు సంధ్యలమాట దేవుడెరుగు' అన్నట్టు, ఇల్లాలు కనుపించి "దొరా ఎన్నెల కురుస్తుండాది. నన్నేలుకోక ఏడకెల్లావు దొరా!" అన్నట్టు, అడవిలో బోయ కన్నెలు ఒళ్ళుమఱచి చిందు వేస్తూ రకరకాల పానీయాలు తాము త్రాగి అతనికిస్తున్నట్టూ— ఇలా రకరకాల ఆలాపనలు. కళ్ళు తెరిచిచూస్తే దగ్గరగా నిలబడి తన రెక్కలు అటూ యిటూ కదలిస్తూ తనకు విసురుతున్న నాడీ జంఘుడు కనుపించాడు. "అమ్మా నాన్న ఇల్లాలూ ఈరూపంలో నాకోసం వచ్చారా" అనిపించి మెల్లగా నవ్వుకొని మళ్లీ నిద్రపోయాడు.



మరునాడు పొద్దున గౌతముడు ఏమీ అడక్కుండానే నాడీజంఘుడు ఇలా చెప్పాడు. "గౌతమా! దారిద్ర్యమన్నది చాలా భయంకరమైనది. దరిద్రుడు సగం చచ్చినవాడితో సమానం. కాబట్టి మనిషి అన్నవాడు తన దారిద్ర్యాన్ని పోగొట్టుకోడానికి ప్రయత్నం చేయాలి. ఆ ప్రయత్నం న్యాయంగా ఉండాలి. పూర్వం ఒకసారి బృహస్పతి మాట్లాడుతూ మంచిస్నేహితుడు, వెండి, బంగారము,

మంచిబుద్ధి-అనే నాలుగూ దారిద్ర్యం తొలగడానికి కారణాలు అని చెప్పాడు. అందులో మంచిస్నేహితుడు ముఖ్యమైన కారణం. నావంటి స్నేహితుని సంపాదించుకున్నావు కాబట్టి నీకు ఇంక దారిద్ర్యం ఉండడానికి వీల్లేదు"

"మీదయ" అన్నాడు గౌతముడు.

"ఇక్కడికి మూడు యోజనాల దూరంలో మధువ్రజం అనే పట్టణం ఉన్నది. దాని పరిపాలిస్తున్న రాజు విరూపాక్షుడు. రాక్షసుడు. నాకు చాలా ముఖ్యమైన స్నేహితుడు." గౌతముడి గుండెల్లో రాయిపడ్డది. ఇంతబ్రతుకూ బ్రతికి రాక్షసుడి కోరలకు నన్ను ఈ కొంగ సమర్పిస్తున్నదా అని భయంతో గజగజలాడుతున్నాడు. ఇది గమనించిన కొంగ నవ్వుతూ అన్నది. "నీవేం భయపడవద్దు. పుట్టుకచేత రాక్షసుడైనా అతడు చాలా మంచివాడు. మంచితనమన్నది పుట్టుకమీద ఆధారపడదు. చేసే పనులనుబట్టి ఉంటుంది. ఆయన దగ్గరకు వెళ్ళి నేను పంపించానని చెప్పు. నీ కోరిక నెరవేరుతుంది." అని చెప్పి ఆ వూరికి మార్గం చూపించింది. గౌతముడు వెళ్ళాడు.

మధువ్రజం ప్రవేశించి రాక్షసరాజును దర్శించి తన పేరు చెప్పుకొని నాడీజంఘుని దగ్గరనుండి వస్తున్నట్టు తనకి డబ్బుతో బాగా అవసరం ఉన్నట్టు చెప్పాడు. విరూపాక్షుడు గౌతముణ్ణి ఎగాదిగా చూచాడు. మనస్సులో అతనికి అనుమానం

వచ్చింది. ఈతని పద్ధతి సరిగాలేదు. చాలా దుర్మార్గుడని తోస్తున్నది. అనుకొని ఇంకా వివరాలు అడిగాడు. డబ్బు సంపాదించాలి అనే స్వార్థంచేత గౌతముడు తన కథయావత్తు పూసగుచ్చినట్టు చెప్పాడు. విరూపాక్షుడు ఊహించింది నిజమైంది. ఇతడు చాలా దుర్మార్గుడు. అయినాసరే తన ప్రాణస్నేహితుడు పంపినవాడు కాబట్టి సహాయం చేయాలి అనుకున్నాడు.

మరునాడు కార్తీక పూర్ణిమ. ఆనాడు విరూపాక్షుడు వేలకొలదీ బ్రాహ్మణులనుపిలిచి అనేకమైన దానాలు ధర్మాలు చేస్తాడు. శివపూజ చేస్తాడు. ఆ సందర్భంలో గౌతమునికి కూడా అతని దారిద్ర్యం తీరేట్టు ధనం సమర్పించాలని నిర్ణయించాడు.

కార్తీక పూర్ణిమనాడు నానా దేశాలనుండి చక్కగా వేదం చదువుకుని నిష్ఠగా జీవిస్తున్న బ్రాహ్మణులు అనేకులు వచ్చారు. వాళ్ళతోబాటు వాళ్ళకి వంటలు చేసిపెట్టడానికి పూజా ద్రవ్యాలు సమకూర్చడానికి కొన్ని బ్రాహ్మణ కుటుంబాలు వచ్చాయి. పొద్దుటనుండి సాయంకాలం వరకు విరామం లేకుండా శివపూజలు, అభిషేకాలు, హోమాలు జరిగాయి. గౌతముడు మాత్రం వీటితో ఏమీ సంబంధం లేకుండా ఓ మూల కూర్చుని విరూపాక్షుడు ఎప్పుడు డబ్బు ఇస్తాడా ఎప్పుడు వెళ్లిపోదామాఅన్నట్టు ఎదురు చూస్తున్నాడు.

అందరికీ బంగారు పళ్ళేరాలలో షడ్రసోపేతమైన విందు జరిగింది. భోజనాలైనాక మణులు మాణిక్యాలు, బంగారు, వెండి మొదలైన విలువైన వస్తువులను బంగారు పళ్ళెరాలలో ఉంచి బ్రాహ్మణులందరికీ ఇచ్చాడు విరూపాక్షుడు. తనకిచ్చిన పళ్ళేరాన్ని తీసుకొని మెడబుజాలు, వీపు నెప్పిపుడుతున్నా లెక్కచేయకుండా మోసుకొని నాడీజంఘుడుండే మఱ్ఱిచెట్టు దగ్గరకు తిరిగివచ్చాడు. తనమిత్రుడు గౌతమునికి ఇంత సంపదనిచ్చి అతని దారిద్రాన్ని తొలిగించాడు కదా అని సంతోషపడింది. కొంతసేపు కబుర్లు చెప్పుకొని ఇద్దరూ నిద్రపోయారు.

అర్ధరాత్రి అవుతున్నది. కొంగ ఒళ్ళుమరచి నిద్రిస్తున్నది. సరిగా నిద్రపట్టని గౌతముడు లేచి కూర్చున్నాడు. రకరకాల ఆలోచనలు అతని మనస్సులో చోటుచేసుకున్నవి. మణులూ మాణిక్యాలూ సరే. పొద్దునలేస్తే తిండి ఎట్లా—పోనీ రేపు పొద్దుట ఈ కొంగ తిండి పెడుతుందే అనుకుందాం ప్రయాణం చేసి ఆ బోయెపల్లెకో మరో చోటికో వెళ్ళాలికదా. మార్గ మధ్యలో ఆహారం దొరుకుతుందో దొరకదో.. ఓ పనిచేస్తే. బాగా కొవ్వి పెద్దశరీరంతో దాదాపు మనిషంత బలంగాఉన్న ఈ కొంగను చంపి దీని మాంసాన్ని మూటకట్టుకొని చక్కాపోతే దోవలో ఎక్కడ కావలిస్తే అక్కడ తినొచ్చు... ఈ ఊహ వచ్చిందో లేదో ఒక పెద్ద కర్ర తెచ్చి చావమోది రెక్కలు

పీకివేసి మాంసం మూటకట్టుకొని ఎముకలు అక్కడ పారేసి బయలుదేరి వెళ్ళిపోయాడు గౌతముడు.

సరిగా అదే సమయానికి మధువ్రజంలో తన అంతః పురంలో హంసతూలికా తల్పంమీద పడుకొని నిద్రపోతున్న విరూపాక్షునికి పీడకలవచ్చి లేచాడు. తన వాళ్ళందర్నీ పిలిచి ఇలాంటి పీడకల వచ్చిందే ఏమి ప్రమాదం కలుగుతుందో అని ఆలోచిస్తుండగా తెలతెలవారింది. మామూలుగా పొద్దున పూట తన దగ్గరకువచ్చి మంచి మాటలతో కాలక్షేపంచేసి తన ఆతిథ్యం స్వీకరించివెళ్ళే ప్రాణమిత్రుడు నాడీ జంఘుడు ఆనాడు రాకపోయేసరికి విరూపాక్షుని మనస్సు పరిపరి విధాల పోయింది. మనస్సు ఏదో కీడు శంకిస్తున్నది. రోజూవచ్చే మిత్రుడు ఇవ్వాళ ఎందుకురాలేదు. ఏదో కారణం ఉండి ఉంటుంది. ఆ బ్రాహ్మణుని పద్ధతిచూస్తే నా భయం మరీ ఎక్కువౌతున్నది. ఆ నీచుడు నా మిత్రుణ్ణి—? ఇలాంటి ఊహ రాగానే తట్టుకోలేక విరూపాక్షుడు తన సైనికులని పంపాడు. వాళ్ళు ఆఘ మేఘాలమీద వెళ్లివచ్చి బ్రాహ్మణుని జాడ తెలీలేదనిచెప్పి నాడీజంఘుని ఎముకలు అక్కడపెట్టి విరూపాక్షునికి చూపారు. విరూపాక్షుడు నిలువునా నీరైనాడు. కన్నీరు మున్నీరుగా విలపించి క్రమంగా ఆ దుఃఖాన్ని దిగమింగి ప్రళయకాలరుద్రుడిలాగా ఇలా గర్జించాడు 'ఏడేడు లోకాల్లో ఎక్కడ దాక్కున్నా ఆ నీచుణ్ణి

పెడరెక్కలు విరిచికట్టి బంధించి నాముందుంచండి. లేకపోతే మీ ప్రాణాలు దక్కవు' రాక్షసవీరులు హడావిడిగా నాలుగు దిక్కులకీ బయలుదేరి వెళ్లి తమ రాజు ఆజ్ఞాపించినట్టు వెదకి వెదికి కళింగదేశంవైపు మాంసం మూటతో, బంగారు పళ్లెంతో పరుగెత్తుతున్న గౌతముణ్ణి పట్టి బంధించి తెచ్చి నిండు సభలో తమ రాజుముందుంచారు. సింహాసనంమీద కూర్చుని ఉన్న విరూపాక్షుడు దిగ్గునలేచి 'ఈ నీచుడిముఖం నేను చూడను. అవతలికి తీసుకొనివెళ్ళి మీరు వాణ్ణి కత్తికోకండగా చీల్చి తినండి' అన్నాడు. రాక్షసవీరులు తమ ముఖాలలో అసహ్యం, ఏవగింపు, ప్రదర్శించి, 'ఎంతమాటన్నారు ప్రభూ ఎంత రాక్షసులమైతే మాత్రం. నరమాంసం తింటాంగాని ఇలాంటి నీచుని మాంసం మేము తింటామా' అన్నారు.

'మీరు తింటారో తినరో- వాణ్ణి నా ముందు నిలవనీయకండి. తక్షణం బయటకు తీసికొనిపోండి' అన్న విరూపాక్షుని మాటమేరకు రాక్షసులందరూ గౌతముని బయటకు తీసుకొనివెళ్లి వాడి శరీరాన్ని ముక్కలుముక్కలుగా కోసివేసి కుక్కలకి పడేశారు. ఆశ్చర్యం. కుక్కలుకూడా వాడి శరీరాన్ని ముట్టుకోలేదు. కడకు కాకులూ గద్దలుకూడా తాకలేదు. ఇలాంటి నీచుడి శరీరం తనమీద ఉంచారే అని భూమాత దుఃఖించింది.



దుఃఖంతో క్రుంగిపోయిన విరూపాక్షుడు చితి పేర్చి నాడీజంఘుని దహన సంస్కారాలు చేయడానికి సిద్ధపడు తున్నాడు. వేద పండితులు మంత్రాలు పఠిస్తున్నారు. కళ్లనీళ్లు పెట్టుకుంటూ విరూపాక్షుడు కొంగ ఎముకలకు అగ్నిసంస్కారం చేశాడు. అగ్నిజ్వాలలు ఆకాశాన్నంటుతూ తన స్నేహితుని తమలో లీనంచేసుకుంటున్నవి. ఇంతలో దేవేంద్రుడు అక్కడికి వచ్చాడు. ఆయన్ని చూడగానే విరూపాక్షుడు పెద్దగా ఏడుస్తూ 'చూడండి దేవేంద్రా. ఎంతఘోరం జరిగిపోయిందో ఈ నా మిత్రుని ఎలాయినా బ్రతికించండి. మీకు పుణ్య ముంటుంది' అన్నాడు. దేవేంద్రుడు విరూపాక్షుని మంచి దనాన్ని, కొంగ ఉత్తమ స్వభావాన్ని గమనించిన వాడుకాబట్టి 'విరూపాక్షా! నాడీ జంఘుడు నీకూ నాకేకాక బ్రహ్మదేవునికి కూడా చాలా ముఖ్య స్నేహితుడు. తనదగ్గరకు రావడంలేదని తెలుసుకున్న బ్రహ్మదేవుడు నాడీజంఘునికి కలిగిన యీ అకాల ప్రమాదం గురించి తెలుసుకునే ఉంటాడు. ఏదైనా చేస్తే సృష్టికర్తయైన బ్రహ్మదేవుడే చెయ్యాలి. మరెవ్వరూ ఏం చేయలేరు. అది అలాఉంచు. నీవుచాలా అదృష్టవంతుడవు. ప్రాణంతో సమానంగా ప్రేమించిన స్నేహితునికి అంత్య క్రియలుచేసి ఋణం తీర్చుకుంటున్నావు' అన్నాడు. ఇద్దరూ మౌనంగా నిలువబడి నాడీజంఘునిపట్ల గౌరవంతో తలలు వాల్చారు. కొంగ ఎముకలను తనలో లీనం చేసుకున్న అగ్నిదేవుడు చల్లబడ్డాడు.

ఇంతలో ఆ దగ్గర ఉన్న కొండచరియలమీద ఒక ఆవు తన లేగదూడకి పాలిస్తుండగా దూడ నోటిదగ్గరనుండి నురుగు గాలికివచ్చి చితిమీద పడ్డది. అందువల్ల కొంగ నిద్రపోయి లేచి వచ్చినట్లు బిరబిరా నడుచుకుంటూ తన మిత్రుడైన విరూపాక్షుని దగ్గరకువచ్చింది. విరూపాక్షుని కౌగిలించుకొని 'క్షేమమా విరూపాక్షా!' అంటూ ఆ ప్రక్కన నిలువబడిఉన్న ఇంద్రునికి నమస్కరించింది. పోయిన ప్రాణాలు లేచివచ్చినట్లు ఇంద్రుడూ విరూపాక్షుడూ సంతోషించి ఇది కేవలం బ్రహ్మదేవుని దయ అని భావించారు. ఇంతలో నాడీజంఘుడు అటూ ఇటూచూచి 'అన్నట్టు ఆ పేద బ్రాహ్మణుడేడీ?' అని ప్రశ్నించింది. 'ఇంకెక్కడి బ్రాహ్మణుడు. వాణ్ణి యమ లోకంలో పాశాలతో కట్టివేశారు. చేసిన పాపాలన్నీ వాణ్ణి కుడుపుతున్నవి' అన్నాడు ఇంద్రుడు. కొంగ కంటతడి పెట్టుకొని 'దేవేంద్రా! నన్ను మన్నించి ఈ ఒక్క కోరికా తీర్చండి. నామూలాన అతడు ఇలాకావడం నేనుసహించలేను' అంటూ ఇంద్రుని కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలింది. ఇంద్రుడు "ఇది నా చేతులో ఉన్నపనికాదు. బ్రహ్మదేవుడు చేయ వలసిందే" అంటూ కళ్ళుమూసుకొని ధ్యానంచేశాడు. సరిగా ఆ సమయానికి బ్రహ్మ సరస్వతి వీణ వాయిస్తుండగా వింటూ సంతోషంగా ఉండి 'సరే అలాగే కానివ్వు' అన్నట్టు దయతో

నవ్వాడు. ఈ సూచన అర్థం చేసుకున్న ఇంద్రుడు తన అష్ట దిక్పాలకులతో ఒకరైన యముణ్ణి ఆజ్ఞాపించగా అంతవరకూ యమ పాశాలలో చిక్కుకొని నరకయాతన పడుతున్న గౌతముడు సజీవుడై దిగివచ్చి తన బంగారు పళ్ళెం తీసుకొని కూడా విడిగా అటూ ఇటూ చూస్తూ వెళ్లిపోయాడు. కనీసం తన తప్పును ఒప్పుకొని క్షమించమని కోరాలనికూడా వాడికి తోచలేదు. తరువాత దేవేంద్రుడు తనలోకానికీ, నాడీ జంఘుడు తన నివాసానికీ వెళ్లిపోయారు. విరూపాక్షుడు హాయిగా అరణ్య రాజ్యం చేస్తున్నాడు.

(ఈ కథలో గౌతముడు మనిషిలోని అన్ని నీచగుణాలనూ కలిగినవాడు. అతడు బ్రాహ్మణుడా మరొకడా అన్నది విషయంకాదు. పతనం చెందినవాడు ఎవరైనా ఒకటే. కాని తమ విజ్ఞానంచేత సమాజాన్ని సరియైన మార్గంలో నడిపించ వలసినవారు బ్రాహ్మణులు. వారు చక్కగా వేదం చదువుకొని నిష్ఠగా జీవిస్తూ ఇతరులకు ఉపకారం చేస్తుండాలి. అలా చేసేవాళ్ళు ఏ కులంలో ఉన్నా వర్ణంచేత బ్రాహ్మణులు. వర్ణమంటే గుణ, కర్మ విభాగంచేత వచ్చిన పుట్టుక. దానికీ ఇప్పుడు మనం అనుకునే కులాలకీ ఏమీ సంబంధంలేదు. ఇన్ని తప్పులు చేసినా అతడు బ్రతకడం కేవలం నాడీజంఘుని

72-4 కృతఘ్నుని శవాన్ని కుక్కలుకూడా ముట్టుకోవు

తయవల్ల. ఇతరులలోని లోపాలను చెడ్డగుణాలను
చేయకుండా ఎల్లప్పుడూ ఉపకారంచేసే ఋషుల లాంటి
నాడీజంఘుడు. తన ప్రాణాలు తీసినవాడికి దేవతలను ప్రా
ప్రాణదానం చేయడం చాలా గొప్పలక్షణం. విరూపాక్ష
నిజమైన స్నేహానికి నిదర్శనం. ఇలా చాలా ర
మన స్తత్వాలు కలిగినవాళ్ళని ఒకచోట ఉంచి అందమైన
నడిపించి మానవజాతికి ఎల్లకాలమూ పనికివచ్చే కృతజ్ఞ
స్నేహము, దానగుణమువంటి ఉత్తమ గుణాలను, ధనాశ
వచ్చే ప్రమాదాలను, గోవు యొక్క మహాత్మ్య
నిరూపించారు వ్యాసమునీంద్రులు.)

* *
*



